నష్టపడే అవకాశముండుంది. అందువల్ల ఈ బిల్లును ఎవరూ అంగీకరించకూడదని నేను కోరుతున్నాను.

*శ్రీ పి. నరసింగరావు (హుజూరాబాద్): మనముందు Hyderabad Tenancy and Agricultural Act కు ఒక సవరణ తీసుకొనిరాబడిన బిల్లువున్నది. ఈ సవరణ ద్వారా 1950 సం॥ నుంచిఈరోజు వరకు ప్రభుత్వము ఒకవైపున భూసంస్కరణలు తీసుకొని వస్తున్నాము, కౌలుదారుకు రక్షణ కల్పిస్తున్నాము అనిచెప్పి ఏటేటా ఈసవరణలుతీసుకొనివస్తూ కౌలుదారులను రక్షణకు బదులుగా, కౌలుదారులను తొలగించడానికొరకై అవకాశాలను కల్పిస్తూ వున్నాము. రిపోర్టునుబట్టి చూస్తే 1951–52 వరకు 1952వ సంవత్సరములో, 1,11,887 కౌలుదారులు వున్నారని, కాని 1954–55 సంవత్సరములో ఎప్పుడైతే సవరణతీసుకొని రావలెనని ప్రభుత్వం ఆలోచించిదో ఆ సందర్భంలో అప్పటి వరకు 57, 743 మంది కౌలుదారులు మాత్రమే మిగిలిపోయారు. ఈ విధముగా ప్రతిసారి భూస్వాములకు నష్టముకలుగుతుందనితోచి నప్పుడు ఒకసవరణ తీసుకొనివచ్చి, ఈసవరణద్వారా కౌలుదారులకు నష్టముకలుగజేయడ మనేది ఒక policy గావున్నట్లు కన్పిస్తున్నది ఎప్పుడైతే 1955లో సవరణ తీసుకొని రాబడిందో అప్పుడు ఆసవరణద్వారా ఒక సంవత్సర సమయము resumption కొరకై 3 Family Holdings కన్నాతక్కువవున్నవారికి అవకాశం కలగ చేసింది. కాని దానికిసాకుగా దానికి కావలసిన రూల్సు ఒక సంవత్సరములోపల frame చేయడంకాలే దన్నారు. దానికి ఒక సంవత్సరముగడువుయిచ్చినా ఒక సంవత్సరము లోపలకాలేదని చెప్పడం ఆకారణాన మరల ఒక ఆరు మాసాలుపొడిగించిడముదానితో యింకామిగితా కౌలుదార్లు కాస్తా, కూస్తో మిగిలినవారుకూడా బేదఖలుఅయ్యేఅవకాశం కల్పించే పరిస్థితితప్పయింకేమి కనపడ డంలేదు. ఒకఆరుమాసాలు సమయము పొడిగించడమే చాలతప్పుఅనినేనుచెప్పుతున్నాను. ఈ ఆరు మాసాల కాలము పొడిగించడమే కాకుండా రెండవది ఇప్పుడు ప్రతిపక్షం కొనివచ్చినసవరణ నేను పూర్తిగా బలపరుస్తున్నాను. ఆసవరణను ప్రభుత్వం అంగీకరించాలని కోరుతూ సెలవుతీసు కొంటున్నాను.

*శ్రీ గోపిడి గంగారెడ్డి (ముధోల్): అధ్యక్షా: మొట్టమొదట నేను మీకువిన్న వించేది. ఏబిల్లుఅయినా తీసుకొనివచ్చినపుడుదానిచిత్తురూపముఇంగ్లీషులోవుండటన్నది. ఇంగ్లీషులో వుండుటచే చాలామంది సభ్యులు వారి అభిప్రాయములను సంపూర్ణముగా తెలియజేయుటకు వీలుండుటలేదు అందుచే ఆ విషయములన్నిటిని తెలుగులో supply చేయించేటందుకు ప్రయత్నిస్తారని మీతోచెప్పుతున్నాను. భూకామందులు, పెద్ద పెద్ద పట్టాదారులులాభం పొందే ఉపాయములతో ప్రభుత్వముయొక్క ధోరణిఅయివున్నది. అందుచేత భూకామందులకుకాక పేద వారందరికీ లాభంకలిగేటట్లు ప్రభుత్వము ప్రయత్నించవలెననినేను ప్రభుత్వమునకువిన్నవించు చున్నాను. కాని భూములలనుంచి కౌలుదారులను తొలగించేప్రయత్నమే మొదటినుంచి జరుగు చున్నది. మొట్టమొదట దున్నేవారికే భూమిఅని నినాదాలు చేసి ఇప్పుడు అమలు పరుస్తున్న పద్ధతిచూడగా 'సత్యమేవజయతే' అనిబోర్డుకట్టుకుంటే దానిలో ఎంతసత్యమున్నదో మనం ఆలో చించాలి.

మిష్టర్ స్పీకర్: వున్నంతవున్నది సత్యము లేనంతలేదు ప్రపంచములో.

శ్రీ గోపిడిగంగారెడ్డి: వున్నంతవున్నది. తిన్నంతతిన్నది. అనేచెప్పుతున్నాను.

మిస్టర్ స్పీకర్: వీలైనంతవరకు ప్రయత్నంచేయాలి.

*శ్రీ గోపిడి గంగారెడ్డి: చేయాలి. రాష్ట్రములో వున్నకౌలు దారులందరిగురించి ఒక record గా తయారుచేసి. నప్పుడు నూటికి 80 మంది భూములనుంచితొలగించబడ్డారని తెలుస్తున్నది. ఇలాకాలము పొడిగించుటవలనపట్టే దారులందరు తమభూములను పంపకంచేసుకొని చాలమంది కౌలుదారులను భూములనుంచి తొలగించుతున్నారు. ఇద్దరు అన్నదమ్ములుకౌలు దారులుగావుంటే, వారిని ఒకే కౌలుదారుగా భావించడంజరుగుతున్నది. ఈ basic holding కౌలుదారుకు వుండాలని వున్నప్పటికి, దానిలోకూడ ఒకఇద్దరన్నదమ్ములు పంపకం చేసుకొనేటటువంటి అవకాశం ఈ చట్టములో లేదు. అందుచేత వీళ్లను భూములనుంచి వెళ్లగొట్టేదానికి మరల ఆరుమాసాల గడువుఅడుగుతున్నారు. కనుక కౌలుదారులనుభూముల నుంచి తొలగించుటకు ప్రయత్నించుచున్నారు. కనుక మరల ఆరునెలల time పొడిగించడం మంచిదికాదని నేను అనుకొంటున్నాను. ఇంతవరకు యిచ్చిన కాలము సరిపోతుందని, వెంటనే దీనిని చర్చించాలని చెప్పుతూ నేను విరమిస్తున్నాను.

*శ్రీ. అనందరావు (మెట్‌పల్లి): అధ్యక్షా, గౌరవనీయులైన సభ్యులు చెప్పిన విషయాలతో నేను ఏకీభవిస్తున్నాను. Rules ఉపయోగించడానికి time లేదని చెప్పి time కలిగించడానికొరకు అవకాశం ఇస్తున్నాము. ఇదిచాల పొరపాటు. పొరపాటే కాదు ఇది ఉద్దేశ్యపూర్వకముగా భూస్వాములకు చాలా సదుపాయాలను కల్పించి Tenants ను ఎక్కువ సంఖ్యలో బేదఖలు చేయడానికి అవకాశంయిస్తున్నాము. భూస్వాములు, కౌలుదారులను బేదఖలు చేస్తున్నారనే రిపోర్టులు మనవద్ద వున్నవి. తెలంగాణాలో నూటికి 45 మంది కౌల్దారులు బేదఖలు అయినారని చెప్పి Government వారివద్ద report వున్నది. ఇతర రాష్ట్రాలలోకూడా ఈ విధముగానే బేదఖలు అయినారనే రిపోర్టులుకూడా వున్నవి. అంటేదాని అర్థం ఏమిటి? జాగ్రత్తగా చదువుకొన్నవారు, తెలివిగలవారు కనుక భూములనుంచి,నయాన, భయాన సామదాన బేధ దండోపాయాలు ఉపయోగించి అనేక వేలకౌలుదారులను బేదఖలు చేసినారని సుస్పష్టము. రిపోర్టులు గవర్నమెంటువారివద్దవున్నవి. వాళ్లు దానిని ఉపయోగించుకోలేదు. టైముయివ్వాలి మరికొంతకాలము అంటున్నారు. ఇక్కడ హైదరాబాదులోను, అక్కడ ఆంధ్రలోను tenancy శాసనములను ప్యాసుచేసినప్పుడు కౌలుదారులను వెళ్లకొట్టకుండా రెండుమూడు చర్యలు తీసుకొనవలసి వుండేది. ఇంతకుముందు చాలాభూమిఉండేదనుకొండి. 5 Family Holdings లేక 6 Family Holdings కన్నా ఎక్కువ భూమి వున్నవారున్నారు. దానినంతను 3 Family Holdings వరకుచేసుకొని మిగిలిన దానిని అమ్ముకొనినారు. అమ్ముకొన్నభూముల్ను దృష్టిలో పెట్టుకొని కౌలుదారులకు రక్షణయిచ్చినట్లయితే మనం కౌలుదారులను రక్షించిన వారంఅవుతాము. పట్టాలుచేయించుకొన్నారు. యీనాము పట్టాలు జరిగాయి. చిన్నచిన్న పిల్లలపేరట పుట్టబోయేపిల్లలపేరు అనేక రకాలుగా యీపట్టాలు వ్రాయించుకొన్నారు. కౌలుదార్లులను బేదఖలు

చేయడానికి వేరువేరు పట్టాలువున్నట్లయితే, తమభూమి పంపకాలు జరుపుకొని, తన పేరిట కొంత మందికౌలుదారులను తనకొడుకుపేరిట కొంతమందిని బేదఖలుచేయడానికి అవకాశములు కల్పించు కొనవచ్చునని యీపట్టాలును చేశారు. దీనిని పదేపదే ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తే చెవిటివారివలె, విని విననట్లుగా నటిస్తు వస్తున్నారని అనక తప్పదు. రెండు మూడు Family Holdings కనిగినవారివలె నమోదుచేయించు కొంటున్నారు. అందుచే అమ్ము కొన్నది Consideration లోకి తీసుకోవాలి. ఆ విషయా దృష్టిలోకి తీసుకొని మనం శాసనంలో Pass చేసి నప్పటినుంచి దానిని Consideration లోకి తీసు కొన్నట్లయితే ఎక్కువమందికి సహాయంచేయగలిగిన వారంఅవుతాము. తెలివితేటలు, ధనబలము వోదాగలిగినవారికి అవకాశం యిస్తూ, యీ rules apply చేసుకొనడానికివీలుగా అన్ని విధాలుగా వారికి సౌకర్యములులభింపచేస్తూ, కౌలుదారులు బేదఖలు చేసినవారం అవుతున్నాము. కాబట్టి ఇకవల్లాంటి అవకాశం యివ్వడానికి వీలులేదని మనవిచేస్తునేలవిర మిస్తున్నాను.

శ్రీ కె. రామచంద్రారెడ్డి (రామన్నపేట) :—అధ్యక్షా, కౌవులు దారి చట్టం సెకన్షు 44 కు సవరణ అనేపేరుతో ఆర్థికమంత్రిగారు ఈ బిల్లును తెచ్చారు. భూస్వాములకు తగు అవకాశం చట్టంక్రింద చిక్కలేదని ఒక సంవత్సరం గడువుచాలదని మరొక ఆరుమాసాలు పొడి గించాలనే ఉద్దేశంతో ఈ బిల్లు తీసుకురాబడింది. వాస్తవంగా చూస్తే జమీందారులుకన్న కవులుదారులే అజ్ఞానంగా చదువులేకుండా చేసేన చట్టాలు సక్రమంగా తెలియని సితిలో ఉన్నారు కవులుదారులు, కన్న కొద్దోగొప్పో తెలిసినవారు చదువుకున్నవారు ప్రభుత్వంచేసే చట్టాలతో వెంటనే పరిచయం ఏర్పరుచుకొని తమ హక్కులను అమలు చేయించుసేవారు అయిన భూస్వాముల కు ఒక సంవత్సరంగడవు చాలదు, మరొక ఆరుమాసాలు కావాలని సవరణ తీసుకురావడం, ఉద్దేశ పూర్వకంగా జమీందారులకు సహాయంచేయడం తప్ప మరొకటికాదు. ఈ సవరణ చట్టం తీసుకురావడానికి పూర్వమే భూస్వాములు చట్టానికి వ్యతిరేకంగా బేదఖళ్ళు చేసారు. ఆ విధంగా బేదఖళ్ళు చేసేన భూస్వాములమీద ప్రభుత్వం కేసులు పెట్టలేదు. కాని చట్ట పరిసితి లోనే క్రమబద్ధంగా తమకు ఉన్న హక్కులను కాపాడుకొనడానికి బేదఖళ్లు కాకుండా ఉన్నటు వంటి రైతులమీద భూస్వాముల పైపునుంచి కేసులు పెట్టిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయి ఇప్పటికి కోర్టులలో ఎన్నో ఉన్నాయి. ఇన్ని ప్రభుత్వంపైపునుంచి పోలీసులు, పోలీసుల సహాయంలో భూస్వాములు పెట్టినారేకాని చట్టానికి వ్యతిరేకంగా నడుస్తున్న భూస్వాములమీద మాత్రం కేసులు పెట్టలేదు. కొద్దిగానా గొప్పగానా ఉన్న అవకాశం కవులుదారులకు రైతులకు చిక్కకుండా మరొక ఆరుమాసాలు పొడిగించాలని అనడంవల్ల ఉన్న కొస్త భూమిని కూడా బేదఖళ్లు చేయడానికి ప్రభుత్వం అవకాశం కల్పించినట్లు అవుతుంది. ఇది చాలా అన్యాయం. కవులుదారులకు మేలుకలిగించాలని ప్రభుత్వం అనుకుంటుంటే కవులదారుల చట్టం చేసి, తరువాత ఇనామీ పట్టాలున్నవారిని, స్వంత సేద్యంలోని భూమిని అమ్ముకుంటున్నవారిని రక్షణకవులుదారులను తొలగించి ఆ భూమిని స్వంత సేద్యంలోనికి తీసుకురావాలని ప్రయత్నం చే వారిని తొలగించే కానూను తీసుకువస్తే—అటువంటి సవరణను తీసుకువస్తే—బాగా ఉండేది కాని అటువంటి సవరణను తీసుకురారు. భూస్వాములు మూడుకుంటుంబాల క్షేత్రంలోనికి లోటు ఉన్న భూమిని స్వంత సేద్యం క్రిందకు తీసుకురావడానికి తగాదా ఉంటుంది కనుక ఇటువంటి

సవరణ బిల్లు తీసుకురావడం చాలా అన్యాయం. ప్రభుత్వ విచారణ కమిటీ తయారుచేసిన లెక్కల ప్రకారమే ఇప్పటికే బేదఖళ్లు అయిన కవులుదారులు 48% వరకు ఉంటారు. చట్ట ప్రకారంగా కవులు దారులకు పంచడానికి హక్కు ఉన్న భూమిని బేదఖలు చేసినా ఆ భూమిని తిరిగి పంచడానికి ప్రభుత్వము ఎట్టి సవరణలు తీసుకురావటములేదు. రైతాంగానికి న్యాయము కలిగించి శాసనము కలిగించే దృష్టితో ఏ సవరణలు తీసుకు రావడం లేదు. 48% వరకు ఇప్పటికే బేదఖళ్లు అయిపోయాయి. కొద్దిగానో గొప్పగానో రైతుల చేతులలో భూములుంటే వాటినుంచి కూడ తొలగించి భూస్వాముల స్వాధీనము చేయడానికి 6 మాసాలు పొడిగించాలని ఉద్దేశపూర్వకంగా ప్రభుత్వం ఈ సవరణ తెచ్చింది ఈనాందారుల చట్టం ఉన్నది. ప్రభుత్వం వారు ప్యాసుచేసినారు. సంతోషం, ఈనాందారులకు దానివల్ల నష్టం కలుగుతుందనే ఉద్దేశంతో వెంటనే దానిని అమలులోనికి రాకుండా suspend చేసారు వారిలాభం కోసము చట్టమునే suspend చేసారు. దీనిని బట్టి రైతాంగానికి కవులుదారులకు మేలు చేయాలని చూస్తున్నారో లేక కొద్దిగానో గొప్పగానో మేలుచేసే చట్టాన్ని కూడా ఊడగొట్టడానికి చూస్తున్నారో తెలియగలదు. ఇటువంటి సవరణను తీసుకురావడం ప్రభుత్వానికి సమంజసం కాదు, దీనిని మాత్రము ఒప్పుకోకూడదు, కవులదారులమేలు కోరి గౌరవ సభ్యులందరు దీనిని వ్యతిరేకించాలని కోరుతున్నాను

శ్రీ కృష్ణమాచారి (సంగారెడ్డి) :—అధ్యక్షా, ఈ సవరణను గౌరవనీయులైన ఆర్థిక మంత్రిగారు తేవడం గురించి నేనుమాత్రం హర్షిస్తున్నాను. శాసనాలువల్ల న్యాయమైన అధికారాలు కవులుదారులకు రావలసిందే, కాని కవులుదారులకు మాత్రమే కాకుండా పట్టాదారుల పక్షమునకు కూడా న్యాయం చేయవలసి యుంటుంది, లేకపోతే సమంజసముగా ఉండదని అభిప్రాయం, precribed forms పైన వారు తమ అర్జీలను అభిప్రాయములను తెలపాలని ఒక సంవత్సరం గడువు ఏర్పాటు చేసియున్నాము. ఎటువంటి రూల్సు లేకపోవడము prescribed forms మొదలైనవి లేకపోవడం మొదలైన కారణాలవల్ల బహుశా చాలామంది ఇవ్వకపోవచ్చును. వారికి అన్యాయం జరిగి ఉండవచ్చును. వారికి న్యాయం జరగడానికి కొంచెం 6 నెలలుకాలం పొడిగించటడం చాలా సమంజసంగా ఉంటుంది. ఇందు నిమిత్తమై గౌరవనీయులైన ఆర్థిక శాఖామాత్యులు తెచ్చిన సవరణను నేను బలపరుస్తున్నాను.

శ్రీ బసవ మానయ్య (అందోలు) :—పూజ్య అధ్యక్షా, మన ఆర్థికమంత్రిగారు తెచ్చిన సవరణ తీసుకొని వచ్చి ఉండవలసినది కాదని నా అభిప్రాయము,. దీనిని తమద్వారా సభ్యులకు మనవి చేసుకుంటాను. సెక్షన్ 44 కు సవరణగా ఇందులో క్లాజు 2 లో వారు కోరినది ఏమంటే, ఆరు నెలలు ఎక్కువ సమయం ఇవ్వాలని కోరారు. 1950 నుంచి ఒక సంవత్సరం లోగా పట్టాదారులు, జాగీరుదారులు, భూస్వాములు Family Holding ప్రకారం స్వంత వ్యవసాయం చేసుకొనడానికి అవసరమైన పిటిషన్లు ఇవ్వాలని కానూన్ ఉండేది, ఐతే ఇప్పుడు మరల అటువంటి సౌకర్యం ఆరునెలలువరకు కలిగించాలనే ఉద్దేశం ఈ బిల్లు లో ఉన్నది.ఇంకా ఏమైనా భూములు లాగుకునేవి గుంజుకొనేవి ఉంటే పూర్తి చేసుకోనివ్వాలనే ఉద్దేశం, వాసన అందరికీ దాని వెనుకకనిపిస్తోంది. ఈ భూస్వాములు, జాగీరుదారులు అందరు కూడా బాగా చదువుకున్నవారై ఉంటారు. కవులుదారులలో 99 మంది నూటికి నూరుమంది కూడా విద్యలేనివారై ఉంటారనుకోవచ్చును. ఏ ఒకరో ఇద్దరో చదువుకున్నవారుంటారు

కవులుదారులకు tenancy forms ఇవ్వవలసిందని తహశీలునుంచి గిర్దావరులు ద్వారా పంపితే దానికి రూపాయి రెండు రూపాయిలు వసూలు చేయడంవల్ల కొందరు తీసుకోక forms ఉండి పోయాయి. సంవత్సరం తరువాత సేద్యం చేస్తుండే కవులుదారు పేరుకాక దొరలపేరుతే పట్వారీలు వ్రాసారు ఆ విధంగా కొందరు త్రోసివేయబడ్డారు. ధైర్యంగా ఎవరైన కవులు దారు అంటి పెట్టుకుని ఉంటే దౌర్జన్యంగా త్రోసివేసారు. ఉదాహరణకు మా ప్రాంతంలో పులికాని నారాయణరెడ్డిగారు అనే ఆయన ఒక కవులుదారుని తీసివేసినారు తహశీలు, కలెక్టరు హైకోర్టువరకు వ్యవహారం తీసుకొని పోయినారు. హైకోర్టువరకు చివరకువారు కవులు దారులకు భూమి ఇప్పించాలని తీర్మానించారు. ఆ భూమి పోలీసులద్వారా కవులుదారుకు ఇప్పించ బడ్డది. ఈ తీరున కవులుదారులకు విద్యలేనివారికి అన్యాయం జరుగుతుంటే, భూస్వాములకు మరల ఒక రక్షణ కల్పించడం అంటే కవులుదారులకు కష్టాలు ఎక్కువ చేయడం అని వేరే చెప్ప నవసరంలేదు. ఒకవైపు ప్రభుత్వంలో పైన ఉన్న పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ వంటివారు socialist pattern కావాలని ఆదేశములు, ప్రకటనలు చేస్తున్నారు, మరొక ప్రక్క ప్రజలకుపయోగమయ్యే చట్టములలో ఇటువంటి సవరణలు, అవసరమైన చట్టాలను సెలక్టు కమిటీలకు పంపాలనడం చాలాఅవకతవకులుగా ఉన్నది. ఇటువంటి కోర్లను గంపక్రింద పెట్టి మూసేకి విధానంవల్ల పరిస్థితులు చాలా విషమించగలవు. పరిస్థితులు ఎంటుపోతున్నాయో గమనించ చండి, 1957 లో కేరళ రాష్ట్రంలో ప్రజలు ఏ విధంగా ప్రవర్తించినారో చూసినాము కదా, 1958 లో ప్రభుత్వం ఎక్కువ వత్తిడి తీసుకురావడంవల్ల ఏ విధంగా ప్రవర్తిస్తారో చూసాము.

మిస్టర్ స్పీకర్ :—ఇప్పుడు యీ బిల్లు పైన చర్చ వాయిదా వేయడమైనది. మిగిలిన వారు రేపు మాట్లాడవచ్చును.

## Boat tragedy on the Godavari at Bhadrachalam.

*Mr. Speaker*: Hon. Members Shri P. Sundarayya, Shri Ravi Narayana Reddi, Shri B. Ratnasabhapathi and Shri Md. Tahseel have asked for short discussion on matters of urgent public importance under Rule 70 of the Assembly Rules. Their letter reads as follows:

"We want to raise discussion on the boat tragedy in Godavari and death of more than 200 persons, a matter of public importance, under Rule 70.

The reasons for raising this matter is the tragedy in such a high magnitude involving death of more than 200 persons, mostly women and children, and the Press reports go to show that the contractors in order to extract huge profits, crowded the boats and this seems to have led to the tragedy. The police and other Government authorities have

evidently failed to take necessary measures to provide facilities for the pilgrims who gathered there in tens of thousands. As such, a public discussion on the floor of the House, will help to bring forth suggestions to probe into the circumstances and causes of this tragedy and take measures to prevent such in future. The Chief Minister when he made his statement on this matter the other day, informed the House that the Minister for Education had left for the scene and the Government could be in possession of greater details and seemed to agree with the opposition suggestion to have a debate on this matter.

So, please allot 2 hours for this subject on 16th or 17th of this month.

11–0 మొదలుకొని 1–0 గంటవరకూ భద్రాచలంవద్ద బోటు మునిగి యాత్రికులు చనిపోయిన విషాద సంఘటన గూర్చి చర్చ జరుగుతుంది. మొట్టమొదట విద్యాశాఖ మంత్రి గారు అక్కడ స్థితిని గూర్చి చెబుతారు. తరువాత వరుసగా ప్రతిపక్షనాయకుడు, మిగిలిన సభ్యులు మాట్లాడుతారు.

విద్యాశాఖమంత్రి (శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు) :—అధ్యక్ష, మహాశయా! 1957 వ సంవత్సరం ఏప్రిలు తొమ్మిదవ తేదీ శ్రీరామనవమి. అది పర్వదినం. భద్రాచలంలో సీతారాముల కళ్యాణ మహోత్సవ దినం. ఆనాడు జయప్రదముగా కల్యాణము జరిగింది. భద్రాచలంలో రామోత్సవంకూడా చక్కగా జరిపారు. ప్రజలు తండోపతండాలుగా వచ్చారు. ప్రతి సంవత్సరంకంటె ఈ సంవత్సరం చాలమంది హెచ్చుగా వచ్చారు. ఆమరునాడు ఉత్సవం చూచుకొని, త్వరత్వరగా వారి వారి యిండ్లకు వెళ్ళాలనే సంబరంతో సరంజామాతో జనం అంతా ఇండ్లకు మళ్ళారు. ఐతే ఆ వెళ్ళేటప్పుడు అక్కడ గోదావరిలో నీరు ప్రతి సంవత్సరంకంటే ఈ సంవత్సరం హెచ్చుగా వుండడంవల్ల తగినన్ని పడవలు అక్కడ రేవు దాటించడానికి హాజరులో లేనందువల్ల జనం హెచ్చుగా విరగబడి పడవలపైకెక్కి దాటడానికి ప్రయత్నం చేశారు. ఆ ఉదయంనుంచి రెండు తడవలు పడవలు అవతలకి దాటించారు. మూడోసారి దాటించడానికి పయత్నం చేసే సమయాన ఒడ్డుకింకా చేరకుండానే జనం మొలలోతు, యింకా కొంచెంలోతు న్రీళ్ళలోకి వెళ్ళి పడవలపైకి ఎక్కారు. ఐతేపడవలపైకి ఎక్కడంలో కూడా హద్దులో పెట్టడానికి వీలులేనంతగా జనం హెచ్చుమంది రెండు పడవలపైకి ఎక్కారు. అక్కడ రెండు పడవలను చేర్చి కట్టి అవతలకు దాటిస్తున్నారు. ఆ విధంగా కట్టడానికి రెండు కారణా లుంటాయి. ఒకటి త్వరగా హెచ్చుమందిని దాటించాలని, రెండు పడవలను కలిపి చేర్చడంవల్ల ఒక పడవైతే అటూ యిటూ తొట్రుపడకుండా రెండు పడవలైతే కొంచెం జాగ్రత్తగా వెళ్ళుతాయనే అభిప్రాయంతో కట్టివుంటారని ఊహిస్తున్నాను. అయితే, ఆ విధంగా కట్టి బయటకు తీసుకు వెళ్ళడంలో జనం ఎక్కువమంది ఎక్కారు. పడవలు రెండింటికిలోనూ ఎక్కాల్సిన మందికంటె హెచ్చుమంది ఆ పడవలలో ఎక్కారు. ఒక పోలీసు కాన్స్టేబులు కూడా ఆ పడవలో వున్నట్టు కనిపిస్తున్నది. కొంతదూరం వెళ్ళిన తరువాత పడవను ఆపి, ఇజారాదార్లు అందులో

కిరాయి వసూలు చేయడానికి ప్రయత్నం చేశారు. ఆ వివరాలు కొద్ది సేపట్లో మనవి చేస్తాను. మొత్తంమీద రెండు పడవలు తొట్రుపాటులో మునిగాయి. నీళ్ళల్లో మునగడంలో రమారమి, కొంచెం హెచ్చు తక్కువగా 300 పై చిలుకు జనం నీటిలో పడవలతో పాటు మునిగారు. అది ఒక విషాద సంఘటన నిజముగా. ముందురోజున ఎంత పుణ్యంగా జనం అంతా ఆ శ్రీరామ నవమి జరిపారో ఆ మరునాడే యిటువంటి దుస్సంఘటన జరిగినప్పుడు భద్రాచలం భీభత్సమైనది ఎంత సంతోషంతో ముందురోజున ఉత్సవాలు జరిగాయో మరునాడు అంత విపరీత మైన విపత్కరమైన పరిస్థితులలో జనాభాను ఆ ప్రదేశంలో చూడాల్సిన గతి వచ్చింది. ఆ ముందు రోజున ఎంత సౌఖ్యంగా ఉత్సవం జరుపు కొన్నారో అంత దుఃఖభాజనంగా 10వతేదీన పరిస్థితులు ఏర్పడ్డాయి. ఇది చాలా దురదృష్టం. కొన్ని వదుల సంవత్సరాలుగా, వంద సంవత్సరాలపైగా అక్కడ ఉత్సవాలు జరుగుతూ వుండగా గోదావరినదిలో అచ్చటచ్చట, వేరుస్థలాల్లో అనేకసార్లు పడవల ప్రమాదాలు జరిగినప్పటికీ, ఇంత విపరీతమైన, యింత దారుణ మైన విధంగా ఆ నదీ మాతల్లి కడుపున ప్రజానీకాన్ని పెట్టుకోవడం జరుగలేదని మాత్రం మనవి చేస్తున్నాను. ఐతే దుస్సంఘటనవల్ల మనకు తెలిసినంతవరకూ, శవాలు దొరికినంత వరకూ, అచటి వారికి 201 శవాలు దొరికాయి. దరిమిలా ఒక శవం కూడా దొరికినట్టు తెలుస్తున్నది. మొత్తం 202 శవాలు కనిపిస్తున్నాయి. ఒడ్డుకు చేరినవారు చేరగా ప్రాణాలు రక్షింపబడ్డవారు రక్షింపబడగా మొత్తంమీద ఆ పడవల మీద 300 పై చిలుకు జనం ఎక్కి నట్టు కనిపిస్తున్నది. ఈ వార్త మన హైదరాబాదు ముఖ్యపట్టణానికి ఆ 10వ తేదీ రాత్రికి చేరినది. వెంటనే ముఖ్యమంత్రిగారు ఆ మర్నాడు ఉదయం నన్ను పిలిచి యీ పరిస్థితులు ఏమిటో నేరుగా చూసి అక్కడ ఏర్పాట్లన్నీ సరిగాచేసి ఏమి జరిగింది factual గా on the spot enquiry చేసివచ్చి తెలుపమని నన్ను ఆదేశించారు. మధ్యాహ్నం బయలు దేరి నేను ఆ ప్రదేశం మెంబరైనటువంటి శ్రీమతి వాణీరమణరావుగారు యిద్దరం కలిసి బయలు దేరి వెళ్ళాం అక్కడకు చేరేటప్పటికి రాత్రి 10 గంటలు అయినది. చేరిన తరువాత అక్కడున్న టువంటి Sub-Collector, D.S.P, Health Officers, Deputy Superin- tendent of Police వగైరా, ఉద్యోగస్తులు, అక్కడున్నటువంటి ఉద్యోగేతరులు చాలా మంది, పట్టణ కాంగ్రెసు ప్రెసిడెంటు, తాలూకా కాంగ్రెసు ప్రెసిడెంటు, యితర మిత్రులు, చాలా మంది, భద్రాచలంలో వున్నటు వంటి పెద్దలు చాలామంది వచ్చి కలిశారు. రాత్రి 11–12 గంటల వరకూ అక్కడ జరిగిన విషయాలు ఎవరంతటవారు చెప్పారు. మరునాడు ఉదయమే ఎక్కడయితే ప్రమాదం జరిగిందో ఆ ప్రదేశాన్ని చూశాము. ఐతే ఆ ప్రదేశంయొక్క వివరాలు చెప్పడం అవసరమని యిక్కడ మనవి చేస్తున్నాను. అవతల ఒడ్డున భద్రాచలంలో మీకింతకు ముందు మనవి చేసినట్టుగా ఆ రెండు పడవలలో జనం ఎక్కారు. అప్పటికి యింకా సుమారు వేయిమంది ప్రయాణికులు ఇవతలికి దాటాల్సి వుండెను. అందులో యీ పడవలలో ఎక్కినవారు ఒడ్డునవున్న ఆ వేయి మందిగాక 300 పైగా ఎక్కారు. సరియైన లెక్క దొరకడానికి అవకాశం లేదు. 300 పై చిల్లర వున్నట్లుగా జనం యొక్క అభిప్రాయం. Official and non-official versions ను బట్టి నేను ఊహించడానికి సాధ్యమైనది. ఐతే యీ జనం ఎక్కి కొంతదూరం వెళ్ళిన తరువాత ఆ పడవలను వీరు మధ్యలో ఆపారని ముందే మనవి చేశాను. ఆ పడవలను రెండింటినీ ఆపడంలో లోతు తక్కువ ప్రదేశంలో కాక లోతు హెచ్చు ప్రదేశంలో

ఆపారు. ఆపడానికి కూడా ఒక కారణం ఉండే ఉండవచ్చును. గాని ఇక్కడ దుస్సంఘటన జరగడంచేత అది మరీ ప్రమాదం అయినది. సాధారణంగా లోతు తక్కువ ప్రదేశంలో పడవలు ఆపితే జనసమ్మర్ధం హెచ్చుగా వున్నప్పుడు ఆ పడవ ఇసుకకు తగులుకుంటే లేవడం కష్టం అవుతుందని కొంచెం నీళ్ళులోతుగా ఉన్నచోట ఆపడం సాంప్రదాయ సిద్ధమే కాని అక్కడ విన్నదానిని బట్టి ఒకపడవలోపలికి నీళ్ళు వస్తూంటడడం తటస్థించిందట, రెండు పడవలు జంటగా కట్టడంవల్ల ఒక పడవలోనికి నీళ్ళు వస్తూండడంవల్ల జనసమ్మర్ధం హెచ్చుగా ఉండి బరువు హెచ్చు అవడంవల్ల నీరు కొంచెం హెచ్చుగా ఆ పడవలోకివచ్చింది. ఎప్పుడైతే నీరు హెచ్చుగా వచ్చిందో అందులోవున్న జనం కంగారు పడ్డారు. ఐతే రెండవ పడవలో కిరాయి వసూలు చేసుకోడానికి ఇజారాదార్లు ఒక మనుష్యుని బెట్టి పడవలను ఏటిమధ్య ఆపి ఆ కిరాయి వసూలు చేయడం ప్రారంభం చేశారు. అద్దరిన అంటే భద్రాచలం ఒడ్డున కిరాయి ఆరుపైసలు నియమం అయినట్లు కనిపిస్తున్నది. ఇద్దరిన అంటే బూర్గంపాడు ఒడ్డున రెండణాలు వసూలు చేయడానికి యిదివరక రూల్సు వున్నట్లు చెప్పారు. ఐతే మొన్నమొన్నటి వరకూ రెండు వేరు వేరు ప్రభుత్వాలు ఉండడం చేత యివతల ఒడ్డునున్న బూర్గంపాడుపై Control హైదరాబాదు ప్రభుత్వానిది. అవతల ఒడ్డు Control ఆంధ్ర ప్రభుత్వానిది. ఇప్పుడు రెండూ ఒకటే అయినవి కనుక యికనుంచి దానిని మార్పు చేయాల్సివస్తుంది. ఇంతవరకూ ఆ పద్ధతులలోనే ఇజారా జరిగింది. ఐతే యీ సంవత్సరం ఇజారామట్టుకు ఎవరో బ్రహ్మయ్య అనే ఒకాయన ఇజారా పాడినట్లు కనిపిస్తుంది. దానిని బొల్లినరామయ్య అనే ఆయనకు Sub lease చేశారు. వీరంతా కలిసి ఆ వసూలు ప్రారంభించారు. ఆ వసూలు ప్రారంభించడంలో నేను మనవిచేసినట్లు అక్కడ ఆరు పైసలు, ఇక్కడ రెండణాలు కాకుండా నాలుగణాల లగాయితు ఎనిమిదణాలవరకూ వసూలు చేయడం మొదలు పెట్టినట్లు కనిపిస్తుంది.

ఆ విధముగా విపరీతమైన హెచ్చు మొత్తమును వసూలుచేసినా, దేవుని దర్శనంచేసుకోవాలనే ఉత్సాహం [illegible] హెచ్చుధనం వుండటమువల్లను, వెళ్ళినప్పుడు ప్రజానీకము mind చేసివుండరు. ఇవ్వటానికిబాధ పడివుండరు. కాని తిరిగి వచ్చేటప్పుడు డబ్బు ఖర్చుచేసి వుండటం వలన హెచ్చుడబ్బు అడిగే టప్పటికి కష్టముకల్గింది. ఆ విధంగా వసూలు చేయటం మంచిదికాదని వాదించారు.అది సహజమే. ఆ విధముగా వాదనచేస్తుండగా వాళ్ళల్లో వాళ్ళకి కలవరము వచ్చింది. ఇంతలో ఒక పడవలోనికి నీళ్ళు వస్తూవుండటము జరిగింది. నీళ్ళు leak అవుతున్న పడవలోని జనము రెండవపడవలోనికి వచ్చారు. వెంటనే ఆ పడవ మీదబరువెక్కువైంది. కొద్దిగా నీళ్ళు గూడా వచ్చినవి. ఖంగారుపడి మళ్ళీ మొదటి పడవలోనికివెళ్ళారు జనం అప్పుడు రెండు పడవలు నీళ్ళతో మునిగిపోయాయి. ఈదగల్గిన మగవాళ్ళు ఒడ్డుకు రక్షింపబడ్డ ఆడవాళ్ళు బైటాపడ్డారు. తక్కినవాళ్ళంతా రెండు పడవల మధ్య నలిగి పోయారు. తరువాత Bulk వల్ల ఆపడవలు విడిపోయాయి. విడిపోయిన తర్వాత కొందరు పైకి వచ్చారు. నీళ్ళలోని వారు పైకివచ్చి ఈదటానికి ప్రయత్నించారు. ఎవరికిదొరికిన దానిని వారుపట్టుకుని పైకిరావటానికి ప్రయత్నించారు. ఈలోగా ఒక పడవపైకి తిరుగ బడింది. అప్పుడు 15 మంది ప్రాణాలు రక్షించుకొన్నట్లు కన్పిస్తోంది. ఇది పట్టపగలు 9 గం. వేళ జరిగింది. కాబట్టి ఈదుస్సంఘటన చూచింకొచోటువ వుండే పడవ, ఒడ్డున వున్న జనం

పైన తేలుతు జనాన్ని ఈదుతూ ప్రాణాలు రక్షించటానికి ప్రయత్నిస్తున్నవారిని రక్షించినట్లు కన్పిస్తోంది. ఎవరంతటవారు సామర్థ్యంతో ఒడ్డుకుచేరి ప్రాణాలు రక్షించుకొన్నారు. వారి సంఖ్య సరిగా తెలియదు. రెండవ పడవలోని సామాను మునిగిపోయింది దీనికి 50 గజాల దూరంలో గోదావరి ప్రవాహానికి అడ్డంగా రాళ్ళగుట్టలు వున్నాయి. గుట్టలమధ్య నుండి వాటి ప్రవాహానికి వీలువుంది. వాటిమధ్య నుండి సామానుదూరముగా కొట్టుకుపోవటానికి వీలులేదు. అందుచేత మునిగిపోయిన సామాను అక్కడేవుండటానికి అవకాశం కల్గింది. పైకి రాగల్గిన వారు వచ్చారు. తీయగల్గినవారిని తీసారు. మిగతా వారంతా మునిగి పోయారు. వారి ప్రాణాలు పోయాయి. పైకి వచ్చిన తరువాత ప్రాణాలు కోల్పోయినవారి సంఖ్య 16. వాటిలో మొత్తం 202 శవాల దక్కాయి. పైకి తెచ్చిన తరువాత Hospital కు తీసుకుపోయిన తరువాత ప్రాణాల దక్కినవారి సంఖ్య 16. వారంతటవారు బయటకువచ్చి వెళ్ళిపోయినవారి సంఖ్య సరిగా దొరకలేదు కాని 70, 80 వరకు వుంటారని వూహించటానికి అవకాశముంది. ప్రాణాలను రక్షించినవారు చెప్పటంవల్ల నేమి, ఇతర officials చెప్పటంవల్ల నేమి, non-officials చెప్పిన version ను బట్టి ప్రాణాలు రక్షించుకొన్నవారు 100 మంది వుంటారని తెలుస్తోంది. క్రిందకు పోయినశవాలు వుంటే వుండవచ్చు. చేయవలసిన ప్రయత్నాలన్నీ చేశారు. కాని దొరికిన శవాలు చాలా తక్కువ. ఆ విధంగా ఒకటి మాత్రమే దొరికింది. ఆ ఒకటిని చేర్చే 202 అని మనవి చేశాను. ప్రాణాలతో బైటపడినవారిలో కొందరు నాభార్య కన్పించటము లేదనో, నా బిడ్డ కన్పించటము లేదనో" చెప్పటంవల్ల కొన్ని శవాలు కొట్టుకుపోయి వుంటాయని వూహించడానికి అవకాశముంది. రాళ్ళమధ్య నీళ్ళప్రవాహముందని మనవిచేశాను. శవాలు తేలిన తరువాత కొట్టుకుపోయి వుండాలి కాని సామాను మాత్రం కొట్టుకు పోవటానికి అవకాశము లేదు. వారి ప్రాణాలు కాపాడటానికి అక్కడ వున్న ఉద్యోగులు, ఉద్యోగేతరులు చాలశ్రమపడి పనిచేశారు. చాలా కష్టపడ్డారు. నీళ్ళలోదూరి సామానులుతెచ్చారు. పడవ మునిగి నప్రదేశములోతు. ఇంకో 50 గజాల ప్రక్కన ఈ దుస్సంఘటన జరిగివున్నట్లయితే ఇటువంటి దారుణము జరిగి వుండేది కాదు. ఇతర చోట్లఇంత లోతు లేదు. ఇది ఒక విషాద గాధగా కన్పిస్తోంది. ఆ వివరాలను పేపర్లలోచదివే వుంటారు. ఈ దుస్సంఘటన చూచిన గుండెలు జారిపోతున్నాయి. కుటుంబములో అంతాపోయి అన్నీపోయి ఏ ఒక్కరో మిగిలిన వారు, భార్య, బిడ్డలుపోయిన తండ్రులు, భర్త, బిడ్డలు పోయిన భార్యలు, తల్లిదండ్రులు పోయిన బిడ్డలు, ఈ విధమైన విషాదగాధలతో కూడిన దుస్సంఘటన జరిగిందని చెప్పటానికి విచారంగా వున్నది. భగవంతుని లీల వలన ఇద్దరు బిడ్డలు బ్రతికారు. ముద్దువచ్చే 18 మాసాలబిడ్డ నీళ్ళలో తేలి వచ్చింది. తల్లిదండ్రి మిగల లేదు. మూడు సంవత్సరాల బాలిక ఒక ముసలామె మెడపట్టుకొని నిలువుగా తేలి వుంది. ముసలామె మాత్రం మరణించింది. ఆ బిడ్డకు తల్లివుండట. బిడ్డను తీసుకవెళ్ళిందని చెప్పారు. పెద్దపెద్దవారు సమసిపోయిన ఈ ప్రదేశములో ఈ ఇద్దరు బిడ్డలు మిగులటము నిజంగా దైవలీలగానే, నేను ఎంచుచున్నాను.

ఇంకొక విశేషము ఈ చార్జీలు వసూలుచేస్తున్న ఇజారాదారు తాలూకు తాబేదారు గజఈతగాడు. అతడిపేరు కన్నయ్యా. చండశాసనుడు. వత్తిడిచేసి వసూలు చేసే మనిషి. కాని అతన్ని దైవంగావం సరిగ్గా చూచ్చాడన్నారు. అక్కడ వాళ్లు గజఈతగాడైనా పసిబిడ్డల ప్రాణాలు మిగిలినచోట అతడి ప్రాణాలు పోయాయి. గజఈతగాడని తెలిసో, లేక ఏదో దొరికింది పట్టుకొందామనో నీళ్ళలో కొందరు ఇతన్ని గట్టిగా పట్టుకొన్నారు. గజఈతగాడైనా కదల

టానికి వీలులేక అతడు బ్రతుకలేదు. అతని పాపఫలితమేకావచ్చు. మొత్తానికి అతని ప్రాణాలు పోయాయి. పోయినవాళ్లు పోగా మిగిలినవారిని Hospital లో చేర్చారు. అక్కడకు డాక్టర్లు శ్రద్ధగా, జాగ్రతగా పనిచేశారు. 11వ తేదీ ఉదయం విచారణచేసి తెలుసుకుంటే ఉద్యోగులు చెప్పిన లెక్క 201 ఉద్యోగేతరులు చెప్పిన లెక్క 223 లేక 224. అయితే శవాలకు నెంబర్లువేసి ఒంటిమీద నగలను లెక్క వ్రాసి ఫాటోలు తీశారు.

ఆ సమయంలో అచటి ఘోరవిపత్తులు చూచినవారికి హృదయములుండకపోతే తప్ప మరో విధముగా చేయడానికి అవకాశముండేటట్లు కన్పించలేదు. అందువల్ల ఆలెక్క సరిఅయిన లెక్కగానే భావించాను. కొంతమంది బంధువులు వచ్చి వారికి సంబంధించినవారి శవాలను తీసుకుపోయారు. ఆ శవాలమీదఉన్న వస్తువులను కూడ తీసుకున్నారు. దొరికిన సామానులను కూడ తీసుకున్నారు. కొంతమంది ఆ శవాలను చూచేటప్పటికి భయపడ్డారు. శవాలు మామూలు పద్ధతిలో లేవు. నీళ్ళలో చనిపోయినారు కనుక అనేక విపరీత పరిస్థితులలో ఉన్నాయి. అవి చాలా భీభత్సంగా ఉన్నాయి. దేవునికి మొక్కుతూ ఉన్నట్లు చేతులు లేక విపరీతమైన ఆకారాలతో నీళ్లతో నిండిపోయివున్న శవాలు అయివుండడంచేత ఎంత దగ్గర బంధువులైనటువంటి వారు కూడా భయపడ్డారు. భయపడి మీరే దహన సంస్కారములు చేయమని ఉద్యోగస్థులను కోరారు. ఆ ఉద్యోగస్థులు దహన సంస్కారములు జరిపించారు. మిగిలి ఉన్న శవాలను అక్కడ పూడ్చిపెట్టారు. అప్పటికే కొన్ని శవాలు పాడైపోతున్నాయి. 10వ తారీఖు రాత్రి చూచారు. 11వ తేదీ కొంతసేపు చూచారు. ఇంకా నిలవ ఉంచితే పాడైపోయేటట్లు కనిపించిలే ఫాటోలు ఉన్నవి కనుక వాటిమీద ఉన్న వస్తువులను జాగ్రత్తాపెట్టి సబ్ కలెక్టరుగారు వాటిని పూడ్పించారు. దానిమీద కూడ కొంత విమర్శ వచ్చింది. పూడ్చిపెట్టడం ఏమిటి దహానం చేయించవలదా అని అడిగారు. నేను ఈ విషయమై సబ్ కలెక్టరును అడిగాను. గుర్తింపబడని శవాలు ఉన్నప్పుడు వాటిని చట్టప్రకారం దహానం చేయడం వీలులేదు. ఎవరైనా వచ్చి ఫోటో చూచి ఫలానా శవమును చూచుకొంటామని అడిగినప్పుడు చూపించటానికి వీలుండే పద్ధతిలో అలా విడివిడిగా పాతిపెట్టడం, ఏ శవం ఎక్కడ ఉన్నదో లెక్క తెలిసేటట్లు, చేశామని చెప్పారు. గుర్తింపబడని శవాలను వారు చెప్పిన రీతిలోనే చేశాము కాని, గుర్తింపబడని శవాలను దహానం చేయడానికి సాధ్యమైన విషయం కాదని చెప్పారు. ఈ పద్ధతిలో మొత్తం మీద ఆ దుస్సంఘటన యొక్క వివరాలు నాకు తెలిసినంతవరకు సభవారికి తెలియజేశాను. మిగిలినవారు కొంతమంది ఆస్పత్రులలో ఉన్నారు. చికిత్సపొంది ఎవరి ఇళ్ళకు వాళ్ళు వెళ్ళారు. కొంతమందికి ఉద్యోగస్థులు కొంత సహాయంచేశారు. ఏదో కొద్దిగా డబ్బు వసూలుచేసి ఇళ్ళకు పోవడానికి వారికి ఇచ్చారు. ఆ కంగారులో వారు చేసినది హెచ్చుగా ఉన్నట్లు కన్పించలేదు. కాని నేను వెళ్ళిన తరువాత ఎవరెవరు మిగిలి ఉన్నారో వారికి బట్టలు యిచ్చి భోజనం పెట్టి ఇండ్లకు వెళ్ళడానికి ఖర్చులు యిచ్చి, భయముగా ఉన్నవాళ్ళకు మనుష్యులను తోడు యిచ్చి పంపించమని నేను ఆదేశించాను. శవములను ఐడెంటిఫై చేసుకోవడానికి బంధువర్గమునకుగాని మిత్రులకు గాని కొత్తగూడెం లగాయతు సదుపాయాలుచేసి జాగ్రత్తగా తీసుకొనివెళ్ళి వారికి రానుపోను చార్జి ఖర్చులిచ్చి పైగా వారికున్న యితర ఖర్చులిచ్చి భోజన సదుపాయాలుచేసి జాగ్రత్తగా చూచి సత్కరించి పంపించవలసినదిగా కూడా చెప్పాను. కావలసిన వైద్య సదుపాయాలు

సహాయం ఈయవలసినదని చెప్పాను. ఐతే సరకులన్నీ దొరుకలేదని మననిచేశాను. కొన్ని మునిగిపోయినాయి. ఆలోతు నీళ్ళలో దిగి సరుకులను తీయగలిగిన డ్రైవర్సు ధవళేశ్వరంలో ఉండి ఉండవచ్చు. కాని భద్రాచలంలో లేరు కాబట్టి అట్టివారిని రప్పించి వెంటనే సరుకులను, ఏమైనా శవాలు ఉంటే వాటిని పైకి తీయించటానికి ప్రయత్నించ వలసినదని చెప్పాను. అక్కడ ఇంకా శవాలు ఉండడానికి అవకాశం లేదు. నీటితో నిండి ఉంటాయి కనుక తేలిపోతాయి. మొత్తం మీద ఆ ప్రదేశమంతా గాలించి ఉన్న వస్తువులను పైకి తీయించమని ఆదేశించాను. ఈ విధంగా చేయవలసిన ఏర్పాట్లు అన్నీచేసి 12వ తేదీ రాత్రికి నేను తిరిగివచ్చాను. వచ్చిన తరువాత ముఖ్యమంత్రిగారికి వివరాలతో కూడినటువంటి నివేదికను ఆదేశించాను. ముఖ్యమంత్రి గారు చాలా ఆందోళన చెందారు. నేను వెళ్ళుతున్నప్పుడే ఆ విషయం నాతో చెప్పారు. ఇది చాలా దుస్సంఘటన రాష్ట్రం వచ్చిన తరువాత క్రొత్త ఎన్నికలు అయి శాసనసభా సమావేశము అయ్యే సమయంలో ఇలాగ జరిగిందనుకోవడమే కాకుండా ఇంతమంది నిండు ప్రాణాలు గోదావరిలో పోవడం చాలా విపరీతమైన విషయం అని ఎంతో ఖేదంతో అన్నారు. ఈ సంగతి అంతా తెలిసిన తరువాత పూర్తి ఏర్పాట్లుచేసి సరిఅయిన విచారణ జరిపించడానికి ఒక సంఘాన్నివేసి పూర్తి విచారణ జరిపించడానికి వారు ఎంతో శ్రద్ధ తీసుకుంటున్నారని మనవి చేస్తున్నాను ఐతే అక్కడకు నేను వెళ్ళిన తరువాత కొంతమంది ఉద్యోగస్థులను, ఉద్యోగేతరులను ప్రమాదంలో నీటిలో మునిగి బయటపడ్డవారిని వారి బంధువులను కొంతమందిని విచారణచేశాను. ఐతే అక్కడకు నేను వెళ్ళిన తరువాత కొంతమంది ఉద్యోగస్థులను విచారణచేశాను. వారిపేర్లు కొన్ని చెబుతాను.

1. సబ్ కలెక్టరు, భద్రాచలం.
2. డి. యస్. పి., తూర్పు గోదావరి జిల్లా.
3. డిస్ట్రిక్టు హెల్త్ ఆఫీసరు, తూర్పు గోదావరి జిల్లా. వగైరా ఉద్యోగస్థులు.

స్థానిక అనధికారులు.

1. శ్రీ కొండలరావు, ప్రెసిడెంట్, తాలూకా కాంగ్రెసు కమిటీ, భద్రాచలం.
2. వనమాల వెంకటేశ్వరరావు.
3. బి. వి. శివశాస్త్రి.
4. కురుచేటి వెంకటసుబ్బారావు.
5. మాల్లాది విశ్వనాథము.
6. డి. లక్ష్మణదాసు.
7. పి. భాస్కరరావు.
8. కె. యల్. హనుమంతరావు.

నీళ్ళలో నుంచి బయటపడి బ్రతికినవారి వద్దనైతేనేమి, చనిపోయినవారి బంధువుల వద్దనైతేనేమి అన్ని విషయములు పరీక్షచేసి సాక్ష్యము తీసుకున్నాము.

(1) శ్రీమతి మట్ట్లీ శీతమ్మ, జనగామ తాలూకా.

(2) శ్రీమతి మరకా పోలమ్మ, ఏలూరు. ఈమె భర్తను, తనవద్ద నున్న సర్వస్వమ్ము కోల్పోయింది.

(3) నందం సుబ్బారావు, మొగల్లు, భీమవరం తాలూకా.

(4) వర్ల మహాంకాళీ వీరిలో ఒకరి యొక్క భార్య, బిడ్డలు అందరూపోయారు. ఒకాయన భార్యపోయింది.

(5) బడుగు సూరయ్య, మండపాడు, భీమవరం తాలూకా

(6) శ్రీమతి అంబటి వెంకటరత్నమ్మ, వెలుపోలు, బాపట్ల తాలూకా—ఈపెడ ఆస్పత్రిలో ఉన్నది. చికిత్సపొందుతున్నది. ఆమెయొక్క తల్లీ, చెల్లెళ్లూ వగైరాలంతా పోయారని చెప్పింది.

మొత్తము మీద ఈ సంఘటనకు చాలావరకు ఆ ఫెర్రీ కాంట్రాక్టర్లే కారణమని నా అభిప్రాయము. వారు ఇంత అశ్రద్ధచేసి ప్రయాణీకులను అతి సుళువుగా ఆటవస్తువులుగా వారు చూడకపోతే, అక్కడ సరిఅయినన్ని పడవలనుపెట్టి ఆ పడవలను సరిగా దాటించే పద్ధతుల ఉంచినట్లయితే ఈ విధంగా హెచ్చు వసూలుచేయకుండా ఉంటే, అందులో నది మధ్యలో కటికివానిలాగా ప్రవర్తించకుండా ఉంటే ఈ విధముగా యిటువంటి సంఘటన జరిగివుండేది కాదు. ఒకవేళ ఏదైనా ప్రమాదము సంభవించినా ఇంత ఘోరవిపత్తు జరిగేది కాదని చెబుతున్నాను. ఏకొద్ది ప్రాణాలుపోయినా మొత్తము మీద యింత ప్రమాదము జరిగేది కాదని నా నమ్మకము. వారు ఆ పద్ధతిలో చేయలేదు. ఇవతలి ఒడ్డునో, అద్దరినో కేవు వసూలుచేయడము సామాన్యము. అది కాకుండా మధ్యలో వసూలుచేయడం విపరీతమైన విషయం. కేవు అర్ధణా రెండణాలు ఉన్నప్పుడు వారు నాలుగణాలు మొదలుకొని ఎనిమిదణాలవరకు వసూలుచేయడమనేది ఈ సమయం దొరికింది కదా ఏదో ప్రోగుచేసుకుందాము అనే పద్ధతిలో చేయడం చాలా దారుణమైన విషయం. ఈ విధంగా జరుగుతూంటే అక్కడ ఉద్యోగస్థులుఉన్నారు కదా వారు ఏమి చేస్తున్నారు? అని నేను అడిగితే వారు చెప్పినది యిది. "ప్రతి సంవత్సరం జరుగుతున్నది యిదే, యిన్ని సంవత్సరములుగా యీ పద్ధతిని ఎప్పుడూ జరుగలేదు. యింతమంది ప్రాణాలుపోలేదు, యీ పద్ధతిలో ఈ విధంగా జరుగుతుందని మేము ఊహించలేదు." అని చెప్పారు. కాని నా అభిప్రాయంలో కొంతవరకు వారిలోటు లేకపోలేదు. అక్కడకు యింత మంది ప్రజానీకం వస్తూన్నప్పుడు కొంచెం ఊహించుకొని కొన్ని ఏర్పాట్లు చేసివుండవలసింది. బేరికేట్సు కట్టి ఎక్కువమంది ఆ విధముగా రష్ కాకుండా ఒక క్యూలో వాళ్ళను పెట్టి ఆ విధముగా ఎక్కించడానికి ప్రయత్నముచేసివుంటే ఎక్కువ మంది జనం పడవలలోనికి ఎక్కడానికి అవకాశం లేకుండా పోయేది. ముఖ్యముగా ఆ వసూళ్ళు నది మధ్యలో చేయకుండా పోలీసువారు ఆపివుంటే బాగుండి వుండేది. అది కూడా జరపకపోవడమువల్ల లోటు లేకపోలేదని నేను అనుకొంటున్నాను. అది అంతా కనిపెట్టి దానికి ఎవరు బాధ్యులు అని చూస్తే ఒక ఇన్‌స్పెక్టరు గట్టున ఉండి ఏర్పాట్లు చేస్తున్నాడు కనుక ఆ ఇన్‌స్పెక్టరు బాధ్యత కొంత వుందని నిర్ధారణ అయినది. అతనిని వెంటనే సస్పెన్డుచేశారు. పడవలలోనివారిని, కాంట్రాక్టర్సును అరెస్టుచేయమని ఆదేశించాము. ఆ విధముగా అరెస్టుచేసి వాళ్ళమీద కేసులు పెడుతున్నారు, ఇదే కాకుండా అక్కడ ఉన్నటువంటి రెండు పడవలను బయటకు తీసి వాటిలో ఏమి లోట్లు ఉన్నాయో, ఆ పడవలలోనికి నిజముగా నీళ్ళు వస్తున్నాయా అనేది పరిశీలించాలి. ? రెండు

పడవలు తట్టుకుని ఈ విధముగా గట్టిగా కొట్టుకోవడములో ఒక పడవకు డామేజీ అయినదని కొంతమంది చెప్పారు. కాని నాకు అందులో నమ్మకం కలుగలేదు. చిన్నప్పటినుండి పడవలు ఎలా ఉంటాయో తెలిసినవాడిని కనుక, గోదావరి నది ప్రక్కన ఉన్న ఒక ఊరిలో నేను ఒక నివాసినైఉన్నాను కనుక, రేవు స్థలము మా ఊరిలో ఉన్నది కనుక ఈ విధముగా పడవలు కొట్టుకొనిపోవడానికి అవకాశములేదని నమ్మకము నాకు పూర్తిగా కలిగినది. పడవలు కొట్టుకుంటే ప్రక్కన కొట్టుకొంటాయి కాని నీళ్ళు ప్రక్కననుండి రావడానికి ఎక్కువ అవకాశములేదు అడుగునుంచే రావటానికి అవకాశముంది అందుచేత అడుగున బెజ్జం ఉన్నట్లు అనుమానం ఉన్నది. ఈ దరిమిలా శాల్వేజ్ చేశారు. ఒక పడవకు ఏమీ తేడాలేదు. రెండవ పడవను అప్పటికి శాల్వేజ్ చేయలేదు. చేయడానికి అవకాశములేదు. ఉద్యోగస్తులు, అప్పుడు అక్కడవున్న కొంతమంది ప్రజలయొక్క సౌకర్యాలనీ చూస్తున్నారు. ఆ పడవను నీళ్ళలోఉంచి ఒక పోలీసును కాపలావేసి జాగ్రత్తగా ఉంచారు. అయితే ఆ పడవను తరువాత తీసినట్లు అందులో నిజముగా బెజ్జము ఉన్నట్లు, నిర్ధారణ అయినది. ఇంకొక విషయం ఉన్నది. అక్కడ తగినన్ని పడవలులేవు సరిగదా సాధారణంగా ప్రతి సంవత్సరం అది పాటిరేవు. పాటిరేవు అంటే మనుష్యులు నడవటానికి వీలైన బాట ఉన్నదన్నమాట. అంటే నీళ్ళు లోతుగా లేవన్నమాట. కాని ఈ సంవత్సరం నీళ్ళు హెచ్చుగా ఉన్నాయి. హెచ్చుగా ఉండడమే కాకుండా అక్కడ తగినన్ని పడవలులేవు. మామూలుగా ఎపుడూ నడిచి వచ్చేవారు ఏ కొద్దిమందికో నడవలేని వారికి కొంచెము సున్నితమైనవాళ్ళకూ పడవలు ఉపయోగించుతున్నటు కన్పిస్తున్నదేకాని సామాన్యజనము నడిచివచ్చేవారు ఇంతకు పూర్వం . ఈ సంవత్సరం అలా సాధ్యంకాలేదు. నీళ్ళు హెచ్చుగా ఉన్నవి గోదావరిలో. అందువల్ల పడవలు ఏర్పాటు లేక అక్కడకు కేపుకోసం వచ్చిన పడవలను మనుష్యులు ఎక్కివచ్చినవి అయితేనేమి, సరుకులు తీసుకొని వచ్చినవి అయితేనేమి (ధవళేశ్వరం, ఏలూరు మొదలైన చోట నుంచి ఉత్సవం సమయంలో అమ్ముకోవటానికి అరిటికాయ, అరిటాకు, పనసకాయ, పనసపళ్ళు, మొదలైన సరుకులు తీసుకువస్తారు.) ఏదో ఒక కిరాయకి మాట్లాడుకొని ఆ పడవలు ఏలా ఉన్నాయో చూచుకోకుండా పెట్టినట్లు కన్పిస్తున్నది.

అయితే నీళ్ళు హెచ్చుగా ఉండడం గురించి Controvercy ఒకటే ఉన్నది, దొమ్మిగూడెం పైన అక్కడ Local ఉద్యోగస్తులతో లాలూచి అయి ఈ కంటాక్టరు నీళ్ళు ఎక్కువ వదిలిపెట్టించాడని. ప్రయాణీకులు నడచిపోవడానికి వీలులేకుండా నీరు ఎక్కువ వదలిపెట్టినట్టయితే, అప్పుడు అందరు ఈ పడవలు తప్పకుండా ఎక్కుతారని, ఈ పడవలతోనే దాటవలసివస్తుందని గనుక ఈ పద్ధతిలో ఎక్కువలాభము చేసుకోవాలని ప్రయత్నం చేశాడని ఒక అభిప్రాయము ఉన్నది. కాని ఆ జిల్లా సూపరింటెండెంటు ఒక తెలివైన పని చేశాడు. ఈ accident అయిన వెంటనే, పరుగెత్తి ఆ Dock Book సీలుచేసి తీసుకువచ్చారు. ఆ సీలు నా యెదుటే విప్పాడు. ఆ పుస్తకంలోని entries చూస్తే అది జనవరి ఒకటవ తేదీ లాగాయతు పుస్తకమని, ఈ నాటిది కాదని తెలుస్తుంది. ఆ entries కూడా దిద్దకుండా ఉన్నాయి. దాన్నిబట్టి చూస్తే ఆ river లో నీళ్ళు కొంచెము హెచ్చుగానే ఉన్నాయని తెలుస్తుంది. ధవళేశ్వరం వద్ద చూచినప్పటికినీ, తక్కిన చోట్ల readings చూచినప్పటికినీ, ప్రతిసంవత్సరంకంటే ఈ సంవత్సరం

(River)లో నీళ్ళు కొంచెము హెచ్చుగా వచ్చినవన్నమాట నిజమేనని తెలుస్తుంది. ఇందులో 6, 7, 8 ఈ మూడు తారీఖులలో శ్రీరామనవమికి పూర్వము, హెచ్చు వర్షము కురిసిందని అక్కడ అంతా కూడ చెప్పారు. దానిని ఒక శుభసూచకముగా కూడా వాళ్ళు ఎంచారు. శ్రీ రామనవమప్పుడు, సీతాకళ్యాణము అవుతూంటె, అంతకు ముందుగా మహానుభావుడు చల్లనచేశాడనేటటువంటి నమ్మకం వాళ్ళలో కలిగింది. ఆ విధంగా ఈసారి river లో నీరు హెచ్చుగా ప్రవహించిందనే మాట వాస్తవంగా కన్పిస్తుందని నా అభిప్రాయము నేను ఆ పుస్తకము చూచిన తరువాతనైతేనేమి, ఆ నీరు చూచిన తువాతనైతేనేమి, వదలిన నీరు కాకుండా, వర్షము నీరే ఎక్కువ వచ్చిందనే నమ్మకం కలిగింది. ఆ పుస్తకాన్ని కూడా seize చేసి ఉంచారు. ఆ పుస్తకాన్నిబట్టి చూస్తే కూడా, normal course లోనే ఎక్కువ నీరు వచ్చినట్లు ఉన్నదే కాని, అంతకుముందు నీరు బాగా తక్కువగా ఉండి గబక్కున ఎక్కువగా వదలినట్లు కన్పించదు. అయితే ఈ విషయంలో controvency మాత్రం ఉన్నది, ఈ విధంగా ఎక్కువగా వదిలారని. ప్రతి సంవత్సరం ప్రయాణీకులు నడచి రావడానికి వీలుగా ఉండేది. ఈ సంవత్సరం అలా కాకుండా ప్రతివారు కూడా పడవ ఎక్కవలసిన అవసరం వచ్చింది. కనుక ఈ విధముగా, నీరు ఈసారి ఎక్కువగా రావడం వల్లనూ, ఈ రెండు పడవలలో ఒకటి ఓటు పడవ అయినందువలనను, ఎక్కువ జనము ఎక్కడంవల్లను, మధ్యలో వాటిని ఆపి ఎక్కువ వసూలు చేయడం వల్లను ఇటువంటి ప్రమాదము సంభవించింది. చనిపోయిన వాళ్లలో చాలామంది స్త్రీలు, పిల్లలు కూడాఉన్నారు. వాళ్ళ వస్తువులు కూడా దొరికినాయి, చాలా జాగ్రత్తగా పెట్టారు. కొన్ని కన్పించలేదు. వాటన్నింటికి diversion చేసి, ఆ మనుష్యులను పిలిపించి నీళ్ళలోకి దూరి క్రిందంతా బాగా చూచి గాలించి ఉన్నవన్నీ పట్టుకొమ్మని ఆదేశముచేశాము. తరువాత వచ్చిన reports ఏమైనా ఉంటే, ముఖ్యమంత్రిగారు చెప్పుతారు. నేనిదివరకు చెప్పినట్లు, అక్కడ relief measures తీసుకొన్నారు. మొత్తం మీద ఇది చాలా దారుణమైన సంఘటన. గోదావరి యొక్క చరిత్రలో ఇదివరకు ఇంతపెద్ద దారుణమైన సంఘటన ఎప్పుడూ జరగలేదని నాయొక్క అభిప్రాయం. నాకు తెలిసినంత వరకు నేను చూచిన విషయం చెప్పుతున్నాను. ఈ సందర్భంలో ప్రభుత్వము తీసుకోవలసిన చర్య కూడా తీసుకొన్నదని చెప్పాను. అక్కడ చేయవలసినదంతా చేస్తున్నారు. ఇక ఈ సంఘటన ఎందుకు జరిగింది. ఈ విధంగా ముందుకు జరుగకుండా ఏవిధంగా చేయాలి, ఇప్పుడు జరిగినదానికి ఎవరు బాధ్యులు, వారికి Punishment ఏమి ఇవ్వాలి. అనే విషయం ముఖ్యమంత్రిగారు త్వరలోనే చెప్పుతారు. అయితే అక్కడ జరిగిన సంఘటన గురించి అక్కడ నేను చూచిన దృశ్యం, ప్రభుత్వము ఇదివరకు తీసుకున్న చర్య తమకు మనవిచేశాను. అక్కడ ఉద్యోగస్తులైతేనేమి ఇతరులైతేనేమి అక్కడ చేయగలిగినదంతా చేశారని నా నమ్మకం. వారందరికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను. ఇటువంటి దారుణ సంఘటనలో ఎన్నో వంతు కూడా ఇకముందు ఎప్పుడూ మన రాష్ట్రములో జరుగకూడదని నేను భగవంతుని ప్రార్థిస్తూఉన్న విషయాన్ని మీ యెదుట పెట్టాను. ఇక సెలవు తీసుకొంటున్నాను.

*[Mr. Deputy Speaker in the Chair].*

మిస్టర్ డిప్యూటీ స్పీకర్.—ఇప్పుడు దీనిమీద ఉపన్యాసం ఇవ్వదలచుకొన్నవారు 15 మంది ఉన్నారు. ఒకటిన్నర గంట మాత్రమే అవకాశమున్నది. తరువాత ముఖ్యమంత్రిగారు సెలవిస్తారు. కావున ప్రతివారికి అయిదు నిమిషములున్నూ, పార్టీ లీడర్స్‌కు మాత్రము పది నిమిషాల అవకాశము ఇచ్చినట్లయితే సరిపోతుందనుకుంటాను. ఈ విధంగా ఈ వరుస ప్రకారం వారికి అవకాశమివ్వబడును. ఇప్పుడు కోదండ రామయ్యగారు మాట్లాడుతారు.

*శ్రీ పి. సుందరయ్య.—ఉపాధ్యక్షా, ఈ motion ప్రతిపక్షమునుంచే వచ్చింది. మా నోటీసు మీదనే ఈ report రావడము, ఈ చర్చ జరగడం సంభవించింది. దీనికి సభానాయకులు అంగీకరించిన మాట నిజమే. అయితే సభాసాంప్రదాయము ప్రకారం factual గా మంత్రిగారు report ఇచ్చిన తరువాత, ఈ motion ఇచ్చినటువంటి వారికి, ప్రతిపాదకులకు మాట్లాడడానికి మొదట అవకాశము ఇచ్చి తరువాత ఇతరులకు అవకాశమివ్వాలి. 70వ రూలులో కూడా ఈ విధంగానే ఉన్నది. అందుచేత ఈ motion ఇచ్చినవారికి కాకుండా, కోదండ రామయ్యగారిని మొదట మాట్లాడమనడం ఆ Rules కు వ్యతిరేకంగా ఉంటుందని గనుక దీనిని తిరిగి మీరు ఆలోచించి ఈ motion ప్రతిపాదించినవారికి మొదట అవకాశమివ్వవలసిందని కోరుతున్నాను.

మిస్టర్ డిప్యూటీ స్పీకర్.—ఈ విషయం నాకు తెలియదు. ఇచ్చట ఉన్న note లో Education Minister గారి పేరు తరువాత కోదండ రామయ్యగారి పేరు ఉండినందువల్ల, వారినే పిలిచాను. కాని మీరు ఈ Motion move చేసి ఉండినట్లయితే, మీకే మొదట మాట్లాడడానికి అర్హత ఉంటుందని నా అభిప్రాయం గనుక తమరు మొదట మాట్లాడవచ్చు.

శ్రీ పి. సుందరయ్య.—ఉపాధ్యక్షా, మంత్రిగారు ఇప్పుడు కొన్ని వివరాలు ఇచ్చారు పత్రికలలో కూడా చాలా వివరాలు చూచాను. మూడు వందలకు పైగా పడవనెక్కారని తెలుస్తున్నది. సరిగా ఎంతమంది ఎక్కారో అంచనా వేయడం కష్టము. ఇంతమంది ఎక్కి ఉండవచ్చునని ఊహించుకోవడము తప్పితే, సరిగా తెలియదు. కొంతమంది నాలుగు వందల ఎక్కారని, కొంతమంది అయిదు వందలు ఎక్కారని కొంత విపరీతంగా కూడా చెప్పడం జరుగుతూంది. సరే మూడు వందలకు పైగానైనా ఎక్కి ఉంటారని అందరు అంగీకరించిన విషయమే తరువాత చనిపోయినవారి సంఖ్య 202 అని అన్నారు. Hindu లో వచ్చిన వార్త ప్రకారం 237 అని ఆంధ్రపత్రికలో 224 అని ఉన్నది. సరే, ఇంకో 10 మందో, 20 మందో ఎక్కువగా చనిపోయారనుకొందాము. దాని లెక్కలు గనుక ఉన్నట్లయితే, అవి దాచవలసిన అవసరమేమి లేదనుకొంటాను. కాని ఇప్పుడు మంత్రిగారు చెప్పడంలో ఎవరో వారిని కలుసుకొన్నట్లును, వారు " నా భార్య నాకు కన్పించలేదని " అన్నారని చెప్పారు. అంటే చనిపోయిన శవాలుగాని, పేర్లుగాని గుర్తుపెట్టేదానికి వీలు లేదన్నమాట. ఇంకా కొంతమంది చనిపోయినటువంటివారి కళేబరాలు కొట్టుకుపోయి ఉండవచ్చు. అవి దొరకకపోవచ్చు." ఇప్పుడు దొరికిన శవాలు 202 అని అన్నారు. ఇంకా 20,30 ఎక్కువ ఉండవచ్చునని అనుకొందాము. మొత్తానికి, 200 కు పైగా 300కు లోపుగా ఉంటారు కొంతమంది బ్రతికివచ్చారు. చనిపోయినటువంటివారి కుటుంబాలకు సానుభూతిని గత

పర్యాయము తెలియజేశాము. ఈ సందర్భంలో పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి అక్కడ Boy Scouts (బాలభటులు) ఆ పడిపోయిన వారిని రక్షించడంకోసం తమ శాయశక్తుల వినియోగించి ఎక్కువమందిని కాపాడడానికి ప్రయత్నంచేశారని తెలుస్తున్నది. వారికి మా ధన్యవాదాలు తెలియ జేయవలసి యుంటుంది. ఐతే ఆ జనసమ్మర్ధంకొరకు ప్రభుత్వము తీసు కోవలసిన చర్యలు ఏమిటి ? ముఖ్యమంత్రిగారు ఈ విషయం గురించి ఖేదపడ వలసిన మాట నిజమే. కాని ఇది అందరు ఖేదపడవలసిన విషయము. ఈరోజు దీన్ని గురించి మంత్రులమీద, ఆఫీసర్లమీద ఉద్యోగస్తులమీద నిందలు మోపాలనే ఉద్దేశ్యంతో మాట్లాడడంలేదు. అసలు ఇటువంటి జనసమ్మర్ధము ఉన్నటువంటి తిరణాలలో తీసుకోవలసినటువంటి చర్యలన్నీ తీసుకొన్నారా అంటే, తీసుకోలేదు, తీసుకోలేదు అనేది ప్రతిఒక్కరూ అంగీకరించక తప్పదు. దీంట్లో కంట్రాక్టర్ల తప్పు ఎంత? ఉద్యోగస్తుల తప్పు ఎంత? ఎవరిని arrest చేశారు అనే ప్రశ్న కాకుండా అసలు ఇటువంటి జనసమ్మర్ధము గలిగిన ప్రదేశాలలో ప్రజలకు కావలసిన సౌకర్యాలు, రక్షణ ఇవ్వవలసిన బాధ్యత ప్రభుత్వం మీద, ఉద్యోగస్తులందరి మీద ఉన్నది. అటువంటి చర్యల మనము తీసుకోలేదని ఈ ఘటనవల్ల చాలా కష్టంగా కన్పిస్తున్నది. అక్కడ ఉద్యోగస్తులు చెప్పిన మాట మంత్రిగారు ఇప్పుడేచెప్పారు. ప్రతి సంవత్సరం ఇదేవిధంగా మామూలుగా జరిగి పోతున్నది. ఇలాంటి ప్రమాదము ఎప్పుడూ జరగలేదు. అదే విధంగా ఈసారి కూడా ఏమి ప్రమాదంలేకుండా జరిగిపోతుందని అనుకొన్నాము. కాని దురదృష్టవశాత్తు ఈ విధంగా జరిగిందని అన్నారు. కాని జనసమ్మర్ధము ఉన్నప్పుడు, ప్రజలకు కావలసిన సౌకర్యాలు, ఏర్పాట్లు రక్షణ, కలుగజేయడం ప్రాథమిక కర్తవ్యం. ఉద్యోగులు చేయవలసియుంటుంది. ప్రజలకు సేవచేసేదానికే అక్కడ ఉన్నాము. అనే ధోరణిలో ఉద్యోగస్తులు ఉన్నట్టయితే మంత్రిగారు ఇలాంటి సమాధానం చెప్పవలసిన అవసరం ఉండేదికాదు. ఈ ఉద్యోగస్తులలో ఈలాంటి వైఖరి, తాము ప్రజలకు సేవచేసేందుకే, వారికి తగిన సౌకర్యాలు కలుగజేసేందుకే అక్కడ ఉన్నాముగాని మరెందుకు అనేటటువంటి వైఖరి ఎప్పుడైతే వస్తుందో, అప్పుడే ప్రజలకు తగిన రక్షణ సౌకర్యాలు కలుగుతాయిగాని అంతవరకు కలుగవు.

తరువాత అక్కడ ఉన్న స్కౌటు నాయకుడు చెప్పిన ప్రకారం అక్కడ బందోబస్తు డ్యూటీ మీద ఉన్న పోలీసులు 52. ఈ శ్రీ కోటంరామారావుగారు యిచ్చిన statement ను బట్టి, యింకా యిద్దరు ముగ్గురు గుడివాడ Advocate యిచ్చిన statement చూస్తే ఆరోజున యింత జనసమ్మర్ధం ఉన్నప్పుడు ముగ్గురు పోలీసులే డ్యూటీ మీద ఉన్నారు, దానికి బాధ్యత Circle Inspector గారిదే గావచ్చును. అప్పుడు ఈ స్థలంమీద ఉన్నారో, ఎక్కడైనా బంగళాలో ఉన్నారో తెలియదు అక్కడకువెళ్ళిన శాసనసభ్యులకు తెలియదు. ముగ్గురు మాత్రమే పోలీసులు ఆ దుర్ఘటన జరిగినప్పుడు ఉన్నారు. 52 మంది ఉన్నా పరిపోయేదా ?

శ్రీ ఎస్. బి. పి. పట్టాభి రామారావు.—అది కరెక్టుగా కన్పించదు. ఆ ఘటనలో మిగిలిన ఆమె, సర్వస్వం భర్తతో సహా కోల్పోయిన ఆమె ( మరకా పోలమ్మ, ఏలూరు) చెప్పిన మాట్లు ఏమిటంటే "పోలీసువారు చాలామంది, 40వరకు ఉన్నారు, బాలభటులు కూడ 50, 60 మంది వరకు ఉన్నారు. రెండు batches వచ్చినవి. కాని ఆ crowd ను

ఆవటం ఒక్కరికి సాధ్యంకాలేదు. మేమే మొలలోతు నీళ్ల లోకి పోయి ఎక్కగలిగాం. లేకపోతే ఆ crowd లో ఎక్కటం సాధ్యం కాలేదు." అని అన్నారు. అయితే ఒక బోటు లేక పోలేదు. 'క్యూ' సిస్టము ఏర్పాటుచేసి ఉంటే, యింత crowd ఉండదేమోనని నేను అనుకొంటున్నాను.

శ్రీ పి. సుందరయ్య.—40 కాదు 400 మందిని పెట్టాల్సిన బాధ్యత ఉద్యోగస్థుల మీద ఉన్నది. వారు తమ బాధ్యత నిర్వహించలేదని గుర్తించాలి. అంత జనసమర్ధముడున్న చోట, ప్రయాణీకులను దాటవేసేపని కంట్రాక్టర్లుకు యివ్వకూడదు. ఇటువంటి దుర్ఘటనలు అనేకం యిదివరకు జరిగాయి. ఇప్పుడు reference కు ఆ పత్రికల cuttings నా వద్దలేవు. అనేక స్థలాలలో యిటువంటి దుర్ఘటనలు జరిగిన సందర్భాలలో జరిగేది ఏమిటి ? జనసమ్మర్దము ఎక్కువగా ఉండడటం, తక్కువ పడవలు—ఆ పడవలవారు కూడా ప్రయాణీకులను నది మధ్యకు తీసుకువెళ్లి డబ్బు వసూలుచేయటం జరుగుచున్నది. ఇది ఈ సంవత్సరం జరిగిన ఘటనేకాదు. మామూలుగా జరుగుచున్న టువంటి విషయమే. ఈ విషయం మంత్రులకు కూడా తెలుసు; ఉద్యోగస్థులకు కూడా ఈ విషయాలన్నీ తెలుసు. కాని ఇప్పుడైనా తగిన జాగ్రత్త తీసుకోలేదు. అటువంటి జనసమ్మర్దనము ఉన్నచోట ముందుగా ticket sytsem పెట్టి, అదనంగాబోట్స్ పెట్టి జాగ్రత్తగా చేయవలసివయున్నది. Contractors కు అప్పగిస్తే వారు లాభాల కోసం పనిచేస్తారు. కాబట్టి లాభాలకోసం పనిచేసే contractors ను పూర్తిగా తొలగించి, తిరునాళ్ల సందర్భంలో ప్రజల రక్షణకు కావలసినఅన్నిసదుపాయాలను కల్పుగజేసి బాధ్యతతో ఆ పనులు నిర్వహించవలసియున్నది. కాని ఆ రీతిగా చేయలేక పోవటం జరిగింది.

అక్కడ రెండు పడవలు జోడించి నడపటం, అందులో ఒకటి చిల్లి పడవ అనేది స్పష్టం అవుతోంది. చిల్లిపడవ సంగతి బందోబస్తులో ఉన్న ఉద్యోగస్థులు చూడలేదంటే చాలా శోచనీయమైన విషయం. కంట్రాక్టర్లుకు పేరాశ ఎక్కువ కాని ఉద్యోగస్థులు ఏమిచేస్తున్నారు ? అక్కడ ఉన్న సర్కిల్ ఇన్స్పెక్టరు ఒక్కడే కాదుకదా ! ఇంత జనసమ్మర్దముంటే అక్కడ ఉన్న ఉద్యోగస్థులు ప్రజల ఎడల తాము నిర్వహించవలసిన బాధ్యత నిర్వహించలేదనేది స్పష్టముగా తేటతెల్లం అవుతోంది.

అక్కడ నదిలో నీరు ఎక్కువైనదని అన్నారు. జనవరినుంచి వర్షాలు పడుతున్నాయి అన్నారు. అక్కడకు వెళ్లివచ్చినవారు చెప్పినది 7వ తేది ఉదయం దాకా జనం కాలినడకను నడిచిపోతూవచ్చారు. ఆ విధంగా అనేకమంది వెళ్లిఉంటారు. స్త్రీలు బిడ్డలు వెళ్ళక పోవచ్చును, రొమ్ములోతువరకు నీరు ఉండవచ్చును. కాని సాయంత్రానికి నీరు ఎక్కువయినదని అంటున్నారు. దుమ్ముగూడెంలో తలుపులు వేయలేదు. నీరు ఎక్కువ అవుతూఉన్నదీ అన్నారు. ఇది ఆశ్చర్యకరమైన విషయం. 7వ తేది ఉదయం దాకా పాటిరేవు ఉన్నది. ఆ సాయంకాలానికి కొద్దిగా వర్షము పడినా, గొద్దిగా వరదవచ్చినా పాటిరేవు పోవుట అసంభవమైన విషయంకాదు. కాని అది నిజంగా జరిగిందా, లేదా అనేది చర్చనీయాంశం. నాకు పుస్తకం చూచినంత మాత్రాన నాకు సంతృప్తి కలుగదు, ఎందుచేతనంటే

రెండురోజుల ముందువరకు పాటి రేవు ఉండి క్రమేణా నీరు $\frac{1}{4}$'', $\frac{1}{2}$'' ఎక్కువ అవుతూఉంటే ఆ విషయం అనుకోవచ్చు. అయినా లాకు పుస్తకం చూసి దానిమీద ఆధారపడటం సరైనది కాదు. లాకు ఉద్యోగస్థులు వ్రాసేటప్పుడు వరద క్రమేణ హెచ్చయిందని గంటగంటకు వ్రాయటం ఉంటుంది. ఆ మాత్రం తెలివితేటలు లేనివారు ఈ పనిచేసేఉండరు. కాబట్టి కేవలం లాకు పుస్తకాల మీద ఆధారపడితే లాభంలేదు. అప్పుడు 7వ తేదీ ఉదయం దాకా మోకాలు లోతు లోడలోతు పాటిరేవు ఉన్నది. సాయంకాలంలోపల నీరు పెరిగింది, వరద వచ్చింది అంటే అదీ యింకొక చర్చనీయాంశమే. కేవలం లాకు పుస్తకాలనుబట్టి నిర్ణయించటానికి వీలులేదు. ఆ విషయం యింకా లోతుగా పరిశీలించి స్పష్టంచేయవలసి ఉంటుంది.

భవిష్యత్తులో యిటువంటి దుస్సంఘటనల గురించి ఏమిచేయాలనేది ఆలోచించాలి. మన దురదృష్టవశాత్తు హోంశాఖా మంత్రిగారు చెప్పినదేమంటే అనధికారం సంఘం అవసరం లేదన్నారు. దీనికి ఎవరు కారకులు, బాధ్యులు ఎవరు, అనేది విచారించుటకు ఒక హైకోర్టు జడ్జికింద ఒక జుడిషల్ కమిటీ వేయుట సరైనదికాదని తమ ఉద్యోగస్థులతోనే, ఇంజనీరు ఇన్స్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు, వేరే యింకొకరితో ఒక కమిషన్ వేసి, యికముందు యిటువంటి ఘటనలు జరగకుండా తగిన చర్యలు తీసుకొంటామని అన్నారు. ఇకముందు అన్నీ మేమే చేస్తాము అని చెప్పటం సరైనదీ కాదు. కేవలం డిపార్టుమెంటు ఉద్యోగస్థుల మీద ఆధారపడి విచారించి, యికముందు శ్రద్ధ తీసుకొంటాము. అనే ధోరణిలో ప్రభుత్వంవారు చెప్పటం సరైనదీ కాదు. ఇక ముందు ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా, యిప్పుడు జరిగిన ఘటనకు ఒక అనధికార కమిటీని, హైకోర్టు జడ్జి కింద వేయుట అవసరం. ప్రత్యేకం ప్రభుత్వోద్యోగస్థులతో కూడిన కమిటీ అయితే న్యాయం జరుగుతుందా అనే అనుమానం ప్రజలకు కలుగకుండా నిష్పక్షపాతంగా, న్యాయాన్ని కప్పిపుచ్చకుండా విచారణ జరుపుటకు ఒక జుడిషియల్ కమిటీని నియమించుట అవసరం. దాదాపు 200కు పైగా చని పోయినటువంటి ఈ ఘటనలో మా ఉద్యోగస్థుల ద్వారా విచారణ చేస్తామంటే, మా మాట నమ్మమంటే ఎట్లాగు. మంత్రులను కూడా ప్రజలే ఎన్నుకొన్నారు అంటే అది ప్రభుత్వాన్ని నడపటానికే. సంజీవరెడ్డిగారు చెప్పినదానిలో ఉన్నది.—మంత్రులను కమిటీవేసి విచారిస్తారని, ప్రజలతో ఎన్నుకోబడ్డ మంత్రుల కమిటీవేరు. ఇప్పుడు ప్రభుత్వ ఉద్యోగస్థులతో వేస్తామంటున్న కమిటీ ద్వారా నిష్పాక్షికంగా విచారణ జరుగుతుందని అంటే అది వాస్తవమైన విషయంకాదు. ఇటువంటి ఘటనలు జరిగిన తరువాత ప్రజలలో ఉన్న అనుమానం తీర్చి అన్ని సందర్భాలు ఆలోచించి ఎవరు బాధ్యులో తెలుసుకోవాలి ఇకముందు యిటువంటివి జరగకుండా హామీ యిచ్చుటకు, సక్రమంగా విచారణచేయుటకు అనధికార సభ్యులతో ఒక హైకోర్టు జడ్జి అధ్యక్షత కింద, విచారణసంఘాన్ని వేయటం అవసరం—రెండు పడవలను కట్టి పోనివ్వటంవల్ల నష్టంవచ్చిందని చెప్పి అనుకొనుటకు వీలులేదని పట్టాభిరామారావుగారు చెప్పారు. కాని గత 20 ఏండ్లుగా యిటువంటి ఘటనలు జరిగినప్పుడు చూస్తున్నాను. పత్రికలలో చదువుతున్నాం. రెండు పడవలవల్ల ప్రమాదాలు ఎక్కువ జరుగుతున్నాయి. భీమవరం కాల్వ, గోదావరి, కృష్ణ నదులలో అనేక ఘటనలు చూచాము. రెండు పడవలు జోడించి నడుపుట అనేది ఎంతవరకు సరైనదో జాగ్రత్తగా ఆలోచించాలి. ఇటువంటి ఘటనలు ముందు జరుగకుండా తగిన చర్యలు తీసుకొంటామని ప్రభుత్వం అనుకున్నప్పటికి

శాసనసభ్యులు కూడా ప్రభుత్వ సమాధానానికి సంతృప్తిపడి ఊరుకొనటం కాకుండా యిటువంటి ఘటనలు జరిగిన తరువాత, ముందు తగు కట్టుదిట్టములుచేయుదురని ప్రజలలో సంపూర్ణ విశ్వాసం కలుగజేయుటకు అనధికార సభ్యులతో హైకోర్టు జడ్జి ఆధిపత్యం క్రింద ఒక కమిటీని వేయవలెనని, అన్ని విషయములు, జాగ్రత్తగా, లోతుగా పరిశీలించి విచారణచేయవలెనని కోరు తున్నాను. లేకపోతే ప్రభుత్వం తన ధర్మాన్ని బాధ్యతతో నిర్వహించుటలేదని ప్రజలు అను కొంటారు. శాసనసభ్యులయినా, యిటువంటి ఘటనలు జరిగినప్పుడు నిష్పాక్షికమైన విచారణ జరిపించుటకు ప్రయత్నించకపోతే తమ కర్తవ్యమును సరిగా నెరవేరుస్తున్నారని అనుకొనుటకు వీలులేదు. సర్కిల్ ఇన్స్పెక్టరును సస్పెండు చేస్తాం, కంట్రాక్టర్సును అరెస్టుచేస్తామంటే అది ఒక భాగమే అవుతుంది. అంత మాత్రంతో సరిపోదు. ఇంకా లోతుగా పరిస్థితులను విచారణచేయుటకు ఒక అనధికార కమిటీని వేయవలసి ఉంటుందని ప్రభుత్వాన్ని కోరుతూ యితర మిత్రులు కూడా మాట్లాడాలని కోరుతున్నాను.

శ్రీ బి. రత్నసభాపతి (బద్వేలు).—ఉపాధ్యక్షా, గోదావరి నదిలో (Interruption)

మిస్టర్ డిప్యూటీ స్పీకర్.—నేను నిన్ననే అధ్యక్షులవారి స్థానములో అధ్యక్షస్థానం కూర్చున్నా ఉపాధ్యక్షులు కూర్చున్నా, Pannel of Chairmen లో వారు ఎవరు కూర్చున్నా, అధ్యక్షా అని పిలవవలసిందని చెప్పాను. పార్లమెంటరీ procedure కూడ అదే గనుక ఆ మాదిరిగా address చేయండి.

శ్రీ పి. సుందరయ్య.—ఢిల్లీలోని పార్లమెంటులో అధ్యక్షస్థానం కూర్చున్నప్పుడు అధ్యక్షాఅని, ఉపాధ్యక్షులు కూర్చున్నప్పుడు, ఉపాధ్యక్షాఅని, Pannel of Chairman లోనివారు మరి ఎవరు కూర్చున్నా Chairman అని, పిలవడము ఉన్నది. అయినా ఎవరు కూర్చున్నా అధ్యక్షా అని పిలవడములో తప్పేమి కాదనుకోండి కాబట్టి ఏవిధముగా పిలిచినను ఒకటే కాబట్టి పార్లమెంటరీ సాంప్రదాయమూ మీ దృష్టికి తీసుకువస్తున్నాను.

Sir, S. K. Krishnavataram (Tadepalligudem): On a point of information Sir,

On the other hand it will facilitate correct noting of the Assembly proceedings as to who is in the Chair. As the Assembly Proceedings also must show a correct state of things, it is better to address the Speaker as Speaker, and whenever the Deputy Speaker occupies the Chair, address the Deputy Speaker as Deputy Speaker only.

*Mr. Deputy Speaker* : I shall give a ruling later.

*శ్రీ బి. రత్నసభాపతి.—అధ్యక్షా, ఇప్పుడు మీరు చెప్పిన సలహా ప్రకారమే మిమ్ములను అధ్యక్షా అని పిలవవలెనో, ఉపాధ్యక్షా అని పిలవవలెనో నాకు తెలియదు. ఏమైనప్పటికిని మీ సలహా ప్రకారము అధ్యక్షా అని పిలుస్తూ మాట్లాడుతున్నాను.

అధ్యక్షా, మంత్రి పట్టాభి రామారావుగారు యిటీవల గోదావరి నదిలో భద్రాచలమువద్ద జరిగిన ఘోరసంఘటనను స్వయముగా చూచివచ్చి ఒక సుదీర్ఘమైన Statement ను యిచ్చారు. ఆ స్టేటుమెంటును మేము విన్న తరువాత, యిదివరకు పత్రికలలో వచ్చినవార్తలను బట్టి, మాకు తెలిసిన విషయాలు, వాటివల్ల మాకు కలిగిన సందేహాలు అన్నీ నివృత్తి కాకుండా, చాలా మట్టుకు నిలిచిపోయినవి. అసలు ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పటికి రెండు మూడు యిలాంటి దుస్సంఘటనలు జరిగినవి. ఇదివరకు అంటే 1952 సం॥లో ఆంధ్ర ప్రభుత్వము ఉండగా గోదావరి నదీ ప్రాంతములో ఒక పెద్ద తుపాను రావడము, దానివల్ల రాజమండ్రి ప్రాంతాలు అన్నీ పెద్దగా నష్టపడడము జరిగింది. ఆ విషయము మనకందరికీ తెలుసును. తరువాత యిక్కడకు సమీపములో ఉన్న జడ్చర్లవద్ద ఒక రైలు ప్రమాదము సంభవించింది. అందులో అనేకమంది ప్రయాణీకులు ప్రాణములను కోల్పోయారు. ఇప్పుడు గోదావరి నదిలో బోట్లు మునగడమువల్ల సుమారు రెండు వందలు పైగా ప్రయాణీకులు చనిపోయారు. కాని యీ విధముగా మూడు దుస్సంఘటనలు జరిగినప్పటికినీ ప్రభుత్వము ఏలాంటి చర్య తీసుకోలేదని మనకు తెలుసు. ఈ గోదావరికి సంబంధించినంతవరకు యిదివరకు ఉన్న రెండు ప్రభుత్వాలు అక్కడ ఏమైనా ఏర్పాటులు చేయాలని అనుకుని ఉంటే, అప్పట్లో ఉన్న హైదరాబాదు ప్రభుత్వం ఆంధ్రప్రభుత్వమున్నూ యివి రెండున్నూ ఏదైనా ఏర్పాటుచేసి ఉండవలసింది. కాని యింతవరకు అలాంటిది ఏమి జరుగలేదు. ఆ విధముగా చేయకుండా, ఏమైనా కొద్దోగొప్పో నష్టములు కలిగినప్పుడు యీ ప్రభుత్వము మీద బాధ్యత ఆ ప్రభుత్వము మీద వేయడము, ఆ ప్రభుత్వము మీద బాధ్యత యీ ప్రభుత్వము మీద వేయడము జరుగుతూవచ్చింది. కాని ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వము ఏర్పడిన తరువాత, యీ రెండు ప్రాంతాలు ఒకటే అయిన తరువాత కూడ, ప్రభుత్వము ఏలాంటి చర్యలు తీసుకున్నదా అని చూస్తే, అలాంటివి ఏమీ కనబడవు. ఈ బోటు ప్రమాదాన్ని గురించి పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి అయితేనేమి, మంత్రిగారు చూచి వచ్చి యిచ్చిన Statement ను బట్టి అయితేనేమి యీ సంవత్సరము భద్రాచలమునకు సుమారు నలభైవేలకు పైగా వచ్చి ఉంటారని, యింతవరకు ఏ సంవత్సరములో కూడ యింత పెద్ద సమూహాము రాలేదని తెలుస్తున్నది. ఇంత పెద్ద సమూహాము వచ్చినప్పుడు ఎటువంటి ప్రయత్నము, ఎటువంటి రక్షణ యాత్రికులకు చేయకపోతే, కనీసము Hygenic గా కూడ అవసరమైన ఏర్పాట్లు చేయలేదన్నట్లు తెలుస్తున్నది. ఇదే సందర్భములో 1953 వ సంవత్సరములో ఇలాంటిదే ఒక పెద్ద సమూహాముతో చేరిన ఉత్తరప్రదేశ్‌లో కుంభమేల అనే ఉత్సవము జరిగింది. అది త్రివేణి నది ఒడ్డున యాభై సంవత్సరములకొకసారో, నూరు సంవత్సరములకొకసారో జరుగుతుందట. అలాంటిచోట కేంద్ర ప్రభుత్వముగాని, రాష్ట్రప్రభుత్వముగాని సుమారు పదీ, యిరవై లక్షలు ఖర్చుచేసి అక్కడకువచ్చిన ప్రజలకు ఏ విధమైన అపాయములుకాని, నష్టములుకాని జరగకుండా తగు ఏర్పాటులు ఎంతవరకుచేసినవో, అందరికీ తెలిసిన విషయమే. తరువాత గతములో జరిగిన గోదావరి నది పుష్కరాలు. మన ఎ. బి. నాగేశ్వరరావుగారు మంత్రిగా ఉన్న సమయములో జరగడము తటస్థించింది. అప్పట్లో మనము ఆంధ్రప్రభుత్వము క్రింద ఉన్నాము. ఆనాడు ఆ పుష్కరాల విషయములో నాగేశ్వరరావుగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. అక్కడకు వచ్చిన యాత్రికులు, వాస్తముగా యిదివరకు ఎన్నడూ కూడ రాలేదని తెలుస్తున్నది. ఆ సమయములో వారు ప్రత్యేక ఏర్పాట్లుచేయించారు. స్వయముగా

వెళ్ళి supervise చేశారు Official Committee అని, Non-Official Committee అని వేసి, ఆ కమిటీల మీాద ఒక Judge గారు preside చేసేటట్లు ఏర్పాటుచేశారు. వారు అటువంటి ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నందుననే, అక్కడ ఎలాంటి దుస్సంఘటనలుగాని అపాయములుగాని, దొంగతనములుగాని ఏలాంటివి కూడ మనము వినలేదు. అంతా సక్రమముగా జరిగిపోయింది. అటువంటి అనుభవాన్ని తీసుకుని అయినా ప్రభుత్వము ఏలాంటి చర్య తీసుకోలేదు. ఇలాంటి దుస్సంఘటన జరిగిందని ప్రభుత్వాన్ని అడిగితే, ఈ రోజులలో ఏర్పాటులుచేయకపోవడము పొరబాటు అనో లేకపోతే అక్కడ officials యొక్క తప్పు అనో, యిలాంటిది ఎవరి మీాదనో బాధ్యత పెట్టివేస్తూ జవాబు యివ్వడము సమంజసముగా లేదు. భద్రాచలములో దేవుని ఉత్సవము ప్రతి సంవత్సరము జరుగుతుందని ప్రభుత్వానికి తెలియకపోలేదు. అక్కడకు వేలకువేలు జనము వస్తారని కూడ తెలుసు. అందులో యిదివరకుకంటే యీా సంవత్సరము నలభై వేల మంది వచ్చారంటే ప్రభుత్వం చేసిన ప్రత్యేక ఏర్పాట్లు ఏమిటి? నలభై వేలు అని పత్రికలలో పడింది గాని, వాస్తవముగా మనకు అక్కడినుంచి వచ్చిన వారి ద్వారా తెలిసినది, యీా సంవత్సరము సుమారు లక్ష మంది దాకా వచ్చారని చెప్పారు. కుంభమేలకు దీర్ఘిగాయి కూడ ఎప్పుడో వచ్చేదికాదు ప్రతి సంవత్సరము జరిగే ఉత్సవమువే. గోదావరి నదికి బ్రిడ్జి లేక బోట్లలో మనుష్యులు గోదావరిలో దాటుతూపోయివస్తారని అందరికీ తెలుసు; ప్రభుత్వానికి తెలుసు. అలాంటి accident జరుగుతుందని మేము తలంచలేదని చెప్పడము, కనీసము ప్రయత్నము అయినా చేయకపోవడము శోచనీయము. Accident జరుగుతుందని అనుకోలేదని చెప్పడము సబబు కాదు. ఈ accident ఎందువల్ల జరిగిందోనని ఆలోచిస్తే, దీనికి సందేహములకు తావులేకపోలేదు. మంత్రిగారు వినివచ్చి చెప్పిన statement ను బట్టి చూస్తే, అక్కడ యీా accident కు ముందు కొద్దిరోజుల క్రిందట వర్షము కురిసినట్లు, అందువల్ల గోదావరికి నీరు వచ్చినట్లు చెప్పుకున్నారని చెప్పారు. దీనికి నేను ఒక్క విషయము మనవిచేస్తాను. ఇప్పుడు జరిగేది వేసవికాలము. ఎక్కడ ఏమాత్రము వర్షము పడినా అతిసులభముగా భూమి ఎండిపోయే సమయములో, నదిలోనికి అంత ఎక్కువ నీరు వచ్చిందంటే నమ్మటానికి వీలుంటుందేమో ఆలోచించాలి. ఇది చాలా సందేహమునకు దారి తీస్తున్నది. భూమి కాలుతున్న సమయములో నీరు యింకిపోతుంది. కాని అంత మిక్కుటముగా నీరు రాదు. పత్రికలలో వచ్చిన వార్తలనుబట్టి చూస్తే యీా accident జరిగిన చోట చాలా మంది జనము నడచి అవతల ఒడ్డుకు పోయినారని కూడా చదివాము. ఇంత త్వరలోనే అంత నీరు గోదావరిలో వచ్చిందంటే నమ్మదగ్గ విషయముకాదు. రెండు మూడు రోజులలోనే తాటి ప్రమాణముగల నీరు వస్తుందా? రాదు. దీనికి వేరే కారణముడున్నది ఇది నిజము కాకపోతే, అంత నీరు రావటానికి కారణము ఏమిటో కనిపెట్టవలసివుంటుందని మంత్రిగారు చెప్పారు. అక్కడ దుమ్ముగూడెమువద్ద వున్న ఆనకట్ట Log Book తెప్పించి చూచారని అందులో ఏమీ information లేదని చెప్పారు. కాని Log Book సరిగా maintain చేస్తున్నారా అనేది సందేహించవలసియుంటుంది. ఎందుకంటె, ఆనకట్ట నుంచి నీరు వదిలితేగాని, క్రింద వ్యవసాయముచేసుకునేవారికి వీలువుండదు వ్యవసాయము చేసుకునే రోజులలో నీరు మొట్టమొదట వదిలే రోజులలో వదిలితేనే వ్యవసాయ

దారునికి ముందు ఉపయోగపడగలదు. అందువల్ల అక్కడ ఉన్న ఆఫీసర్లకు, అక్కడ supervise చేసే అధికార్లకు డబ్బు యిస్తే, లెక్కలు చూపకుండా, నీరు వదిలితే ఏ ప్రభుత్వముగాని, ఏ అధికారిగాని అంత పెద్ద నదిలో నీరు ఎంత ఖర్చు అయినది, పోయినది తెలుసుకోవడము కష్టము. కాబట్టి Lock Book లోని లెక్కలు సరియైనవి అని చెప్పలేము. ఈ మాదిరిగా P.WD. వారు కాలువలకు అకాలములో చాటుగా వ్యవసాయముచేసుకునే రైతులకు నీరు యిస్తారన్నది మనము నిశ్చయముగా వినడము లేదా. దీని నిజపరిస్థితి ఎవరికి వారు ఆలోచించమని సభవారిని కోరుతున్నాను. ఈలాంటిది జరగడము ఏ డెల్టా ప్రాంతములో కూడ జరుగుతునేఉన్నది. ఇది అందరు నిజమని ఒప్పుకోక తప్పదు. Lock Book లో record చేయకుండానే నీరు యివ్వడము జరగదని చెప్పగలరా? ముందు వేసవికాలములో అంత మిక్కుటముగా గోదావరిలో తాటి ప్రమాణమునకు మించి నీరు వచ్చేటంత వాన కురిసి ఉంటుందా? కాబట్టి యిది సందేహించవలసిన విషయము కాబట్టి యిది పరిశీలించవలసివుంటుంది. ఇదే కాదు. ఇంకను అనేక విషయములు ఉన్నవి. అవి అన్నీ కూడ పరిశీలించి దర్యాప్తుచేయవలసిన అవసరము ఉన్నది.

రెండుమూడు boats ఉపయోగించాము మిగతా boats లేకపోయినాయి అన్నారు. కాని పత్రికలలో వచ్చిన వార్తలను బట్టి చూస్తే accident జరిగిన స్థలానికి కొద్దిగజాల దూరములోనే ఇంకా చాలా boats నిలిచి వున్నాయి. అవి ఉపయోగించబడకుండా అట్లాగే నిలిచివున్నాయి. అందులో కేవలం బెజ్జము పడినటువంటి boat ని ఉపయోగించారని అన్నారు. ఈ boats ను ఉపయోగించే ముందు inspection ఎవరైనా చేసి అవి సక్రమంగా ఉన్నాయా, లేదా అని inspection, చేసి certify చేసిన తరువాత ఆ boats ఉపయోగించినట్లుగా కన్పించడంలేదు ఎన్నాళ్ళనుంచో వాడుతున్నాము. పరిపాటి అయిపోయింది. ఈరోజు accident జరుగుతుందని ఎవరూ అనుకోలేదు, Accident జరుగుతుందని తెలిసి వుంటే మేము చేస్తామా? అని కారణం చెపితే అది చాల అసమంజసంగా ఉన్నదని, చెపుతున్నాను. ఎన్నాళ్ళనుంచో గోదావరిలో తిరుగుతున్నారు నిజమే ఇంతవరకు చేయకుండా పోవడానికి కారణం ఏమిటి అని అడుగుతున్నాను. Boats చేసే చోట, ఆ boats ను ఉపయోగించే చోట inspection చేసి ఆ boats మంచిగా, సక్రమముగా ఉన్నవని certify చేసిన తరువాత వాటిని ఉపయోగించె టట్లు చేయవలసిన అవసరం వున్నది.

కుంభమేళం జరిగేటప్పుడు కూడా నేను చూశాను. పెద్ద పెద్ద సమూహాలు పెద్ద పెద్ద నదులు వున్నచోట emergency squad అని కూడా పెడతారు. ఇటువంటి accidents ఏవైనా జరిగితే emergent గా వెంటనే ఆ దెబ్బ తిన్న వాళ్ళకు ఆ ప్రమాదంలో ఇరుక్కున్నవాళ్ళకు సహాయం చేయడానికి గాను emergency squad అని Fire Engines ఉన్నట్లుగా squads పెట్టి వాళ్ళను రక్షించడానికి ప్రయత్నం చేస్తారు. ఇక్కడ ఇటువంటి squad ఏమీ పెట్టలేదు. ఎందుకు పెట్టలేదు అంటే సామాన్యంగా జరుగుతోంది గనుక ఇక్కడ పెట్టాల్సిన అవసరంలేదనే సమాధానం చెప్పగలుగుతారేమోగాని ఇకమీదటనైనా ఇటువంటి squad పెట్టాల్సిన అవసరం వున్నదని అనుకొంటున్నాను.

అక్కడ ఒక Circle Inspector ఒకరో ఇద్దరో police లు వున్నట్లు కన్పిస్తోంది. ఇటువంటి సందర్భాలలో Health Department, Religious Endowment Department, Police Department ఈ మూడు శాఖలకు బాధ్యత వున్నది. Police Inspector Constable వీళ్ళిద్దరు మాత్రమే అక్కడ వుండి supervision చేసినట్లు చూపించారు. మిగతా officers అక్కడకు ఎందుకు పోలేదు? వాళ్ళు ఎక్కువ శ్రద్ధ ఎందువల్ల తీసుకోలేదు. ఎందుకు వీళ్ళ సిబ్బందిని అంతా అక్కడకు చేర్చలేదు? వీటన్నిటికీ మంత్రిగారి దగ్గరనుంచి సమాధానం ఏమీ రాలేదు. మంత్రిగారు వెళ్ళి visit చేసినారు. ఏదో కొంతమందికి మాత్రమే ఆహార పదార్థాలు బట్టలు మొదలగు సౌకర్యాలు కల్పించామని చెప్పారు. కేవలము ఆహారము, బట్టలు, మాత్రమే కాదు ఇంకా మిగతావి చాలా వున్నాయి. తల్లిదండ్రులను పోగొట్టుకొన్న పిల్లలు, పిల్లలను పోగొట్టుకున్న తల్లిదండ్రులు, ఇంకా సర్వస్వము పోగొట్టుకొని కుటుంబానికి ఏ ఒకరో ఇద్దరో మిగిలిన వారుకూడా ఉన్నారు. వాళ్ళ అచోకీ ఏమీ తేల్చలేదు. మంత్రిగారు visit చేసినప్పుడు ఈ విషయాలన్నీ రాకపోవచ్చు వచ్చిన తరువాత నయినా ఆ విషయాలన్ని సేకరించ డానికి ప్రయత్నం చేశారా అంటే ఏమీలేదు. తలిదండ్రులను కుటుంబాలను అన్నీ పోగొట్టు కున్న చిన్న చిన్న పిల్లలు ఎవరైనా వుంటేవాళ్ళకు చదువులు తిండి తీర్థాలు పెద్దవాళ్ళై ఉద్యోగం చేసుకొని స్వయంకృషితో సంపాదించుకోడానికిగల వయస్సు వచ్చేంతవరకు వాళ్ళను పోషించాల్సిన బాధ్యత ప్రభుత్వంమీద వున్నది. వాళ్ళకు కావలసిన పనులు ఏవిధంగా సమకూర్చాలో ఆలోచించవలసి ఉన్నది. దానివిషయమై ప్రభుత్వం ప్రతేక శ్రద్ధ తీసుకోవాలి. ఇంతవరకు శ్రద్ధ తీసుకున్నట్లు సూచించకపోవడం చాల విచారకరము.

Enquiry Committee ను గురించి Home Minister గారు ఒక Statement ఇచ్చారు. I.G. of Police నో ఇంకా మిగతా వాళ్ళను ఒకరి నిద్దరినో వేసి ఒక కమిటీని ఏర్పాటు చేసి వారిచే enquiry చేయించవలెనని statement ఇచ్చారు. Home Department వారు Health Department వారు Religious Endowments Department వారు వీళ్ళు ముగ్గురు చేసినటువంటి పొరపాటు వల్ల ఇంతపెద్ద ఘోరమైనటువంటి సంఘటనజరిగిందని ఇదివరకే మీకు నేను తెలియ చేశాను. ఇటువంటి functions లో వీళ్ళు చేయాల్సినటువంటి బాధ్యతకూడా వున్నది. ఆభాద్యతను నెరవేర్చక పోవడం వల్ల ఇవన్నీ జరిగినాయి. అటువంటప్పుడు I.G. of Police కూడా ఒక నేరస్తుడు అయినాడు. వాళ్ళ Department వాళ్ళు చూపినటువంటి indifference వల్ల ఇవన్నీ జరిగినాయి. అంతేకాకుండా Health Department వారు Religious Endowment Department వాళ్ళు వాళ్ళ యొక్క బాధ్యతలను సక్రమంగా నెరవేర్చకపోవడంవల్ల ఈ incident జరిగిందని తేలిపోతోంది. అటువంటప్పుడు accused గా ఉన్నటువంటి వాళ్ళన Judge గా వేస్తూ ఆ కమిటీలు నుంచి Enquiry చేయమంటే న్యాయం జరుగుతుందా లేదా అని ఆలోచించుకోవలసి ఉన్నది. ఒక District Police Department పైన

నేను Charges పెట్టినపుడు అదే Department వాళ్ళను ఆ charges మీద Enquiry చేయమన్నారు. అటువంటప్పుడు accused ని judgment ఇవ్వమంటే వ్యవహారాన్ని విచారించమంటే ఎంత న్యాయం జరుగుతుందో అదే విధంగా ఇప్పుడు I.G. of Police ను Health Department వాళ్ళను మిగతావాళ్ళందరను కూడా ఒక కమిటీగా ఏర్పరిస్తే జరుగబోయే న్యాయంకూడా అంతే. అంతేకాదు చేయాల్సినది ఇంకా లోతుగా పోతే లాల్‌బహదూర్‌శాస్త్రిగారు చేసినటువంటి పనిని ఈ మంత్రులు కూడా చేసివుంటే చాలా బాగుండేది అనుకుంటాను. ఆరోజున వారు department లో వున్నటువంటి inefficiency అంతా బైటపరుస్తూ దానిసే చక్కపరచలేకపోయానని తెలియ జేస్తూ ప్రపంచానికి ఒక నిదర్శనాన్ని, ఒక మార్గాన్ని చూపిస్తూ, "నేను చేయలేక పోయినాను గనుక రాజీనామా ఇస్తున్నాను" నాకు పదవికాదు ముఖ్యము service అని తెలియజేస్తూ రాజీనామా ఇచ్చారు కాని ఇక్కడ జవాబు దారీగల మంత్రులు, బాధ్యత కలిగి నటువంటి మంత్రులు ఒక్కరు కూడా రాజీనామా చేయకుండా మంత్రి పదవులను అంటిపెట్టు కోవడం చూస్తే చాలా ఆశ్చర్యకరంగా ఉన్నది. ఆ ముగ్గురు మంత్రులు రాజీనామా ఇచ్చి కమిటీలో వాళ్ళను కాకుండా వేరొకరిని judge లు గా వేస్తూ అందులో ఉన్న పార్టీలకు representation కల్పించి ఆలస్యం జరగకుండా విచారణ జరిపిస్తే న్యాయం జరుగు తుందని నేను తెలియ జేస్తున్నాను. నా సూచనలును అంగీకరించి ముఖ్య మంత్రిగారు ఖచ్చితంగా వీళ్ళందరికీ సలహాలు ఇస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

మిస్టర్ డిప్యూటీస్పీకర్:—ఇప్పుడు ఇంకా 18 మంది సభ్యులు ఉపన్యాసాలు ఇవ్వాలని అనుకుంటున్నారు. సమయం చాలా తక్కువగా వున్నది. ఒక్కొక్కరికి 2 నిమిషాలకంటె ఎక్కువ అవకాశం వుండదు. అందువలన అదిగమనించి తమ ఉపన్యాసాలను తొందరగా ముగించాలని కోరుతున్నాను.

*శ్రీ పి. కోదండ రామయ్య (పోలవరం):—ఉపాధ్యక్షా, భద్రాచలంలో ఇటువంటి ఘోర మైనటువంటి సంఘటన జరిగినందుకు నేను నా సంతాపాన్ని తెలియ పరుస్తున్నాను. 1904 సంవత్సరంనుంచి నేటి వరకు కూడా భద్రాచలంతో నాకు సంబంధం వున్నది. అప్పుడు రాజకీయంగా నా కార్యస్థానము అక్కడే వుండేది. ప్రతి సంవత్సరం మూడు, నాలుగు మాసాలు అక్కడ నేను నివసించడంకూడా జరుగుతూ వుండేది. అటాంటి ప్రదేశంలో ఇటాంటి దుస్సంఘటన జరిగిందంటే మనస్సుకు చాలా ఖేదంగాను, బాధగాను వున్నది. దుఃఖకరంగాను వున్నది. అయితే ఈ సంఘటన జరగడానికి గల కారణాలను చెప్పడానికి సావకాశం లేదు. సంఘ మరణం వచ్చినపుడు ఎవరు తప్పించలేరని నేను భావిస్తున్నాను. అయితే ఏమి జరిగిందో నేనుకూడా వెళ్ళి విచారిద్దామనుకొన్నాను గాని ఆరోగ్యం సరిగా లేకపోవడంవల్ల వెళ్ళి విచారించలేకపోయాను. నేను నా మిత్రులకు వ్రాస్తే పోలవరం తాలూకా నుంచి భద్రాచలం తాలూకా నుంచి నా మిత్రులు మందలపాటి నరసింహారావుగారు, అమరనాథశాస్త్రిగారు మొదలై వాళ్ళంతా వచ్చి వారికి తెలిసిన విషయాలన్నీ చెప్పారు. ఇప్పుడు ఆ విషయాలన్నీ తమ ముందర పెట్టడానికి సావకాశం లేదు. ప్రతిపక్షంవారు చెప్పినటువంటి విషయాలలో కొన్ని సంగతులు మంత్రులకు గాని ఇతరులకు గాని

తెలియకపోవుట వలన ఆ విషయాలను విమర్శించడంగాని, భేదాభిప్రాయాలను వెలిబుచ్చడంగానీ మంచిదికాదు. వారికి నిజ పరిస్థితులు తెలియకపోవడం మూలాన కొన్ని విషయాలు మాత్రము నేను మనవి చేయ దలచుకొన్నాను. రెండు పడవలు కలిపి కట్టారని నా మిత్రులు చెప్పారు. ఒక పడవ పెద్దది రెండవది చిన్నది. ఒక్కటి 5 టన్నులది, రెండవది 10 టన్నులది. 5 టన్నుల పడవలో ఎంతమంది ఎక్కుతారో, పది టన్నుల పడవలో ఎంతమంది ఎక్కుతారో experts ఎవరైనా వుంటే మనకు స్పష్టంగా చెప్పగలరు ప్రజాపక్షమువారు హెచ్చుమంది జనం ఎక్కారని దీనిని బట్టి చూస్తే మీరు చెప్పిన 300 మంది కూడా ఆ పడవలో పట్టడానికి అవకాశం వుండదు. అయితే ఒకరిమీద ఒకరు నుంచునో, ప్రక్కల వెంబడి నుంచునో ఏలాగో అలాగా ఎక్కి ఉంటారు.

**Mr. Deputy Speaker:** Time is over. Sri Md. Tahseel.

*శ్రీ మహమ్మద్ తహశీల్ (భద్రాచలం—జనరల్) :—ఉపాధ్యక్షా గౌరవనీయులైనటువంటి విద్యామంత్రిగారు మొట్టమొదటి సారిగా గోదావరిలో పడవ మునిగి పోవడానికిగల కారణాలను గురించి వివరంగా తెలియ జేశారు. వారు చెప్పిన కారణాలతో నేను ఏకీభవిస్తున్నాను. అయితే ఈ సంవత్సరం శ్రీరామనవమి ఉత్సవమునకు ఎక్కువమంది జనం వచ్చారనేసంగతిని అందరూ అంగీకరిస్తున్నారు. ప్రతి సంవత్సరంకూడా కమిటీవారు చేసిన ప్రయత్నాలను బట్టి చూస్తే ఈ సంవత్సరం 10 వేల మందికంటె ఎక్కువ లేరు. ప్రతి సంవత్సరం కూడా అక్కడ జరిగే టటువంటి రక్షణ ఏర్పాట్లు చాలా ఎక్కువగా ఉంటూ వుండేవి. ఈ మధ్య కొన్ని సంవత్సరాల నుండి అంతగా జనం రావటం లేదు కాబట్టి ఈ సంవత్సరం అనవసరంగా ఎక్కువ పోలీసు సిబ్బంది పంపవలసిన అవసరం ఏమి వుందని duty నిర్లక్ష్యంచేసి అక్కడకు 130 మంది పోలీసులను మాత్రమే పంపి బందోబస్తు ఏర్పాటు చేశారు. నేను అక్కడకు వెళ్ళి ఈ విషయాన్ని గురించి అక్కడి పోలీసు అధికారులతో సంప్రదించినపుడు వారు నాతో చెప్పిన సంఖ్య ఇది. ఈ 130 మందిలో 60, 70 మంది duty చేయకుండా rest తీసుకుంటూ వుంటే మిగత 60, 70 మంది పోలీసులు duty చేస్తూ ఉంటారు. ఆ విషయం అందరకూ, ప్రభుత్వానికి కూడా తెలుసు. 40, 50 వేల మంది జనం వచ్చినప్పుడు 60, 70 మంది పోలీసులు ఏ విధంగా Control చేయగలరని ప్రభుత్వంవారు భావించారో నాకు అర్థం కావడం లేదు. పోలీసులను పంపడం మూలంగా ప్రభుత్వానికి ఖర్చు అవుతుందనే దృష్టితో అక్కడ బందోబస్తు సౌకర్యాలు ఎక్కువగా చేయలేదు. జనం ఇంకా ఎక్కువగా వస్తారని స్థానికంగా ఉన్న అధికారులకు తెలిసి కూడా ఏమీ జోక్యం చేసుకోకుండా చాలా నిర్లక్ష్యం చేయడం జరిగింది ఇప్పుడు పెద్ద ప్రమాదం జరిగినది, దీనికి ముందు ఏమైనా ప్రమాదాలు జరిగాయా ? అయితే అక్కడి ప్రభుత్వో గస్తులు అక్కడ ఏమి action తీసుకున్నారు ? అనే విషయాలను మనం విచారించవలసిన అవసరం వున్నది. 31–3–1957న మధ్యాహ్నం గుంటూరు వాస్తవ్యులు ఒకరు నీటిలో మునిగిచనిపోవడం జరిగింది. తరువాత 7వ తేదీన భద్రాచలం రేవులో స్నానం చేస్తున్న తల్లి పిల్ల ఇద్దరూ మునిగి చనిపోవడం జరిగింది. తరువాత 9–4–57న కళ్యాణం అయిన తరువాత సాయంత్రం రేవు దగ్గరలోనే పడవ మునిగి పోయినది. పడవ రేవుకు ఒడ్డున మునిగి పోటడము వలన జనం అంత కూడా ఏ ప్రమాదానికి గురి కాకుండా సురక్షితంగా బయట పడ్డారు. ఆ పడవలు మునిగి పోయాయనే విషయం Contractors కు ప్రభుత్వోద్యోగులకు కూడా తెలపడం జరిగింది. అయితే వరుసగా 4, 5 ప్రమాదాలు జరిగినప్పుడు ప్రభుత్వోద్యోగులు

ఏమి చేశారో! అని మనం విచారించవలసిన అవసరం వున్నది. 9వ తేదీన కళ్యాణం జరిగి నప్పుడు స్థానికంగా వున్నటువంటితహాశీల్దారు, కలక్టరు, Dy. S.P.వీరంతా కూడా ఉత్సవం జరుగుతున్నప్పుడు చాల బందోబస్తు చేశారు. చాల బాగానే ఉన్నది. తలంబ్రాలు పక్ట్రేటటు వంటి సమయంలో అందరూ కూడ దేముడిని చూడడం కోసం కుటుంబాలతో సహా, బంధుమిత్రు లతో వచ్చి చూస్తే సక్రమంగా కనిపించడానికి మాత్రం తగిన బందోబస్తు చేసి, మరునాడు ఆ ప్రజలయొక్క అవసరాలను గుర్తించకుండా నిర్లక్ష్యంచేసి జనాన్ని ఎవరి దారికి వారిని విడిచిపెట్టి వారు పోయి ఇండ్లలో కూర్చోవడం జరిగింది. ఈ ప్రమాదం సరిగా 9 గంటలకు జరిగింది ఇదే గనుక 10, 11 గంటలమధ్య జరిగి వున్నట్లయితే అక్కడ వున్నటువంటి స్థానిక ఉద్యోగు లంతా ఎక్కడకో dinner కు పోయి ఉండేవారు. వారి రక్షణ కొరకు మాత్రమే ఈ ప్రమాదం 9 గంటలకు సంభవించింది. ఇకముందు అయినా ఇటువంటి అవకతవకలు జరుగ కుండా ప్రభుత్వంవారు తగు చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. తరువాత, పడవలో జనాన్ని దాటవేసేటప్పుడు అదనంగా charge చేస్తున్నారని మంత్రిగారు అంగీకరించారు. అర్ధణా రేటు ఉన్నదానిని 0-4-0, 0-8-0 వరకూ వసూలు చేస్తున్నప్పుడు పోలీసు వుద్యోగస్తులు గానీ, Revenue Department వారుగానీ ఏమి చేస్తున్నారని నేను ప్రశ్నిస్తున్నాను. ఈ విషయం ప్రభుత్వోద్యోగుల కందరకూ తెలుసును ఇట్లా చాలాకాలంనుంచి జరుగుతున్నదని మంత్రి పట్టాభిరామారావుగారు కూడా అంగీకరిస్తు న్నారు. మంత్రిగారే ఆ విధంగా అంగీకరించినట్లు చెప్పడం చాల పొరపాటని నేను మనవి చేస్తున్నాను.

శ్రీ యస్. బి. పి. పట్టాభిరామారావు :—అధ్యక్షా, నేను దానిని సమర్థించడంలేదు, జరిగిన విషయం అది.

శ్రీ మహమ్మద్‌తహాశీల్ :—వారు అక్కడకు వెళ్ళి పరిశీలించివచ్చిన తరువాత అసెంబ్లీలో చెప్పిన విషయాలను నేను చెప్పినాను, గాని వారికి అంతకు ముందు తెలుసునో, తెలియదో నాకు తెలియదు. వారు చెప్పినదే నేను చెప్పినాను. ఆ విధంగా వసూలు చేసినట్లు అక్కడ వున్నటువంటి వుద్యోగులందరకు తెలుసు. నేను పార్లమెంటు మాజీ సభ్యులైన కామేటి మోహనరావుగారు కలిసి 1953వ సం. లో floods వచ్చిన తరువాత కొంత సామాను వేసుకొని భద్రాచలం రేవుమీదుగా ప్రయాణం చేస్తుంటే 0-4-0 వసూలు చేశాడు ఈ విషయాన్ని అక్కడ వున్నటువంటి ప్రభుత్వోద్యోగులకు, R. D.O గారికి, Report ద్వారా తెలియ జేశాము. వారు ఏమీ చర్య తీసుకోలేదు 4 అణాలు వసూలు చేస్తూనే వున్నారు. మేము petition పెట్టినప్పటికీ ప్రయోజనమేమీ లేకపోయింది. అర్ధణాకు బదులు 4 అణాల వసూలుచేస్తూనే వున్నారు. చాలామంది జనం పెడుతూనే వున్నారు.

[*Mr. Speaker in the Chair*]

*శ్రీ పి. నరశింగరావు(హుజూరాబాదు) :—అధ్యక్షా, భద్రాచలంలో జరిగిన విషాద సంఘటన నుగురించి మన ముఖ్యమంత్రిగారు విద్యాశాఖామంత్రిగారు వివరాలను సభికులకు అందజేశారు. తదుపరి, మిగత సభ్యులు, ప్రతిపక్ష సభ్యులుకూడా తమకు తెలిసిన విషయాలనన్నింటినీ వివరించారు. మనమంతా సంతాపాన్ని తెలియ చేశాము. ఈ విధంగా దుస్సంఘటనలు జరిగినప్పుడల్లా సంతాపాన్ని

తెలియజేస్తూ ఏడ్చేవారి కళ్ళనీళ్ళను తుడిచినట్లుగా చేస్తూంటే సరిపోదు. ఇప్పుడు జరిగిన దుస్సంఘటనవల్లనైనా మనం ఒక చక్కని గుణపాఠము నేర్చుకోవలసి యున్నది ఈ ఉత్సవమే కాదు తెలంగాణా ప్రాంతంలో ఎన్ని జాతరలు జరుగుచున్నవో అన్ని జాతరలలో కూడ ప్రభుత్వం పైవునుంచి సౌకర్యాలు ఏర్పడుతున్నాయని చెప్పడంలో సందేహం లేదు. ప్రతి జాతరకు ఒక కమిటీని ఏర్పాటు చేస్తారు ఈ జాతరకు వేసిన దేవళ్ కమిటీలో అక్కడవుండే ఉద్యోగులను వారికి కావలసిన సౌకర్యాలకు చూడగలిగిన వాళ్ళను ఏ దేశముఖులనో, దొరలనో వేయడం జరుగుతోంది. ఈ జాతర సందర్భంలో ఉద్యోగులు వాళ్ళ సౌకర్యాల కొరకు చూసుకుంటూ భోగవిలాసాలకు ప్రాధాన్యమిచ్చుకుంటూ, యాత్రికులకు కావలసిన ఏర్పాట్లను, సౌకర్యాలను కలిగించకపోవడం సహజమైన విషయం. మన ప్రభుత్వంవారు ఇప్పటికైనా దీర్ఘంగా ఆలోచించి యాత్రికులకు కావలసిన సౌకర్యాలను గురించి గట్టిగా ఆలోచించాలని మనవి చేస్తున్నాను. కమిటీని నియమించే సందర్భంలో కూడా ప్రభుత్వం ఏదో దేశముఖులనో, దొరలనో, నియమించడం జరుగుతుంది. ఎక్కడైనా జాతర జరుగుతుంటే ఆ ప్రాంతపు శాసనసభ్యులకు, లేక ప్రతిపక్ష సభ్యులకు ఇతర అధికార పార్టీలకు స్థానం ఇచ్చి ఇటువంటివారితో కూడిన కమిటీలను ఏర్పాటు చేసినట్లయితే తగు ఏర్పాట్లు జరుగుతాయి గాని, అటువంటిదేమీ చేయకుండా అక్కడ ఉద్యోగులకు మాత్రమే తగిన సౌకర్యాలు కలుగజేసే వారినే ఈ కమిటీలో వేసి లాభంలేదు. ఇప్పుడు ఇటువంటి సంఘటనలను పురస్కరించుకొని ఒక జస్టిస్ అధ్యక్షతన, Official, Non-Officials ఏర్పాటు చేయాలి. తగిన విచారణ జరిపించాలి. ఒక్క ఈ జాతరమాత్రమే గాక మిగతా తెలంగాణాలోనూ, ఆంధ్రలోనూ కూడా తిరునాళ్ళు జరుగుతూ ఉంటాయి. వీటన్నింటిలో కూడ తగిన బందోబస్తు కలుగజేస్తారని ఆశిస్తూ నేను శలవు తీసుకుంటున్నాను.

*శ్రీమతి పి. వి. రమణారావు (భద్రాచలం—రిజర్వడ్) :—అధ్యక్షా ప్రతి సంవత్సరం బ్రహ్మాండమైన ఉత్సవము జరిగే భద్రాచలములో ఈ సంవత్సరం పడవ ప్రమాదము జరిగిందని చెప్పుటకు చాలా విచారించుచున్నాను. 200 మందికి పైగా పడవ ప్రమాదములో చనిపోయారు. ప్రమాదము జరిగినదని తెలిసిన వెంటనే ముఖ్యమంత్రి, మంత్రి పట్టాభి రామారావుగారిని అక్కడకు పంపారు. నేనుకూడా వెళ్ళాను, అక్కడ పరిస్థితులన్నీ విచారణ చేశాము అక్కడ ప్రమాదము నుంచి బయటపడిన వారికి తగిన సౌకర్యములు కలుగచేసిదారి ఖర్చులు ఇచ్చి వాళ్ళను ఇళ్ళకు పంపేఏర్పాట్లన్నీ చేశాము. అక్కడవున్న స్త్రీ పురుషులకు నా శక్తికొలది సహాయముచేసి వారిని ఓదార్చి ఇండ్లకు పంపాను. మరణించిన వారి కుటుంబాలకు, ప్రమాదంనుంచి తప్పించుకున్నవారికి ప్రభుత్వం తగు సహాయం చేస్తుందని విశ్వసిస్తూ ఇటువంటి ప్రమాదములు ముందు జరుగకుండా వుండేందుకుగాను గోదావరిమీద వంతెన కట్టించేందుకు ప్రయత్నించమని కోరుతూ విరమిస్తున్నాను.

*శ్రీ పి. నరశింహప్పారావు :—అధ్యక్షా మంత్రి పట్టాభిరామారావుగారు భద్రాచలం విషాద సంఘటన గురించి చెప్పారు. ఈ విషాద సంఘటన జరిగినదని తెలిసినవెంటనే ముఖ్యమంత్రి ఆందోళన పడుతూ వెంటనేవివరములు తెలుసుకొని రమ్మని పట్టాభిరామారావుగారిని పంపించారు. ఇటువంటి సంఘటనలు చాలా జరుగుతున్నవి. జరిగిపోయిన దానిని గురించి ఆలోచించడంకంటే ముందు జరుపబోవు కర్తవ్య మేమిటి అని ఆలోచించాలి. హైదరాబాదు ప్రాంతములోనే ఇదీనరకు

రైల్వే ప్రమాదం ఒకటి జరిగింది. హైదరాబాదుకు కర్నూలుకు మధ్య ఇంకొక ప్రమాదం జరిగింది. ఇది మూడవ ప్రమాదమన్నమాట. ఈ ప్రాంతములోనె జరగడము Train Accident జరిగిందంటే అయిపోయిన తరువాత అంతా వెళ్ళి చూశారు విచారణచేసి చేయవలసినదే ఏముంది ? కొంతమంది తల్లులు పిల్లలు చనిపోయారని కొంతమంది తల్లులు చనిపోయారని బాదపడ్డవల జరుగుతున్నది. కాని వీళ్ళకు జరుగ వలసిన సౌకర్యములు ఏమీ జరగడంలేదు. విచారణలు చేయడము అనేది ఒక అలవాటు అయిపోయింది. విచారణ చేయించుటవలన లాభము ఏమి వుంది. ముందు ఇటువంటి సంఘటనలు జరుగకుండు నట్లుచూచుకోవాలి. దానికి ముఖ్యముగా contract పద్ధతి తీసివేయా లని చెపుతున్నాను. Contractors డబ్బు కొరకు, ఆశపడి అనేకవిధాల తాపత్రయ పడి ఉద్యోగస్తులను చేతులో పెట్టుకొని డబ్బు సంపాదించడానికి ప్రయత్నిస్తున్నారు. అది లేకుండా departments బాధ్యత వహించి నడిపిస్తే బాగుంటుంది. గవర్న మెంటు కారులు వున్నాయి. దానిలో వున్న capacity ప్రకారము పంపిస్తాము తరువాత మళ్ళీ మిగిలిన జనమును పంపిస్తారు. Contractor అయితే డబ్బుకు ఆశపడి తన యిష్టము వచ్చినటు అనేక మందిని ఎక్కించి ఎక్కువ చార్జీలు వసూలు చేస్తూ ప్రయాణీకులను తీసుకుని వెళ్ళడం జరుగుతుంది అందుచే యీ కంట్రాక్టరు పద్ధతి తగ్గించి వేయాలని ముఖ్యమంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఇంక విచారణ అని చెప్పు తున్నారు. కమిటీవేసి విచారణ ఏమి చేశారు? ఏ విచారణ చేసినా, ఏ కమిటీలు వేసినా ముందు చనిపోయినవారి కుటుంబాలకు గవర్నమెంటు పరముగా కొంతడబ్బు సహాయం చేయాలి. దిక్కుమాలిన వారికి కొంత compensation యిస్తే బాగుంటుంది. ఈ కమిటీలను వేసి, కమిటీల కొరకు డబ్బు ఖర్చుపెట్టే దానికంటె చనిపోయినవారి పిల్లలకు సానుభూతి పూర్వకముగ సహాయము చేయాలని మనవి చేస్తున్నాను.

*శ్రీ ఎ. వెంకటాద్రిమరాజుగారు.—అధ్యక్షా, ముఖ్యముగా ఈ సంఘటన జరిగిందని తెలిసిన, వెంటనే నదీ తీరాన వున్నవారిని వెంటనే నివారణ చర్యలు జరుపుటకు నియమించడములో చాలాప్రాధాన్యత వున్నదనే నా అభిప్రాయము. అయితే అక్కడకు వెళ్ళివచ్చిన మంత్రిగారు తెలిపి నటువంటి రిపోర్టులో కొన్ని భాగాలు ప్రశ్నార్థకములుగా విడిచిపెట్టబడినవి. వాటితో నేను ఏకీభవించలేకపోతున్నాను. వారు చెప్పిన విషయాలలో మన పత్రికలలో వచ్చిన వార్తలలో ఒక భాగమువుంది. రెండు పడవలు కట్టి దాటవేస్తున్నారని, ఆ కట్టుతెగి పోవడము ఈ ప్రమాదములో ఒక ప్రధానకారణమని పత్రికలలో వున్నది. ఇది కనుక నిజం అయితే నదీతీరాన వున్నవారు అంతా అర్థముచేసుకోగలుగుతారు.

మన పోలవరం సభ్యులు చెప్పినట్లు అక్కడ 5 టన్నుల పడవ, 10 టన్నుల పడవ జతకట్టబడి, సాగివున్నట్లైతే అది గూడా techinical aspect లో పరిశీలించినట్లైతే చాలా తీవ్రమైన ప్రమాదాన్ని కలుగజేయడానికి సావుకాశం వుందని సూక్ష్మముగా అర్థము చేసుకోవచ్చును. మూడవ విషయము Tour programme ప్రకారం Superin-tendent Engineer భద్రాచలములో వున్నారని అర్థము చేసుకొన్నాము. అలాంటప్పుడు మంత్రిగారు వాకబు చేసివున్నట్లైతే అసలు రెండు ఆనకట్టలు మీద ఆ తేదీలల్లో

రీడింగ్సు ఎటూ వున్నవో తెలుసును 7వ తేదీన ధవిళేశ్వరం ఆనకట్ట మీద, దుమ్ముగూడెంవద్ద రీడింగ్సు ఎట్లావున్నవో తెలుసుకొని, 7, 8, 9 తేదీలలో ఎట్లా రీడింగు Develop అవుతున్నదీ తెలుసుకొన్న యెడల, ఎంత rainfall వచ్చింది. ఆ rainfall వల్ల ఎంత రీడింగ్ పెరిగింది అనే techinical aspect లో పరిశీలించలేక పోయినందుకు మంత్రిగారితో ఏకీభవించలేకపోతున్నాను. అట్లాంటి విషయాలన్ని ప్రశ్నార్థకముగా విడిచిపెట్టినందువల్ల ఈ విచారణ సమయములో తెలియజేయవలసిన దుర్గతి పట్టింది. అందుచేత సరియైన technical aspect లో పరిశీలించకపోయినట్లయితే రేపు వేసే కమిటీ కూడా సరిగా విచారణ చేయలేదు. ఎవరెవరి మీద ఏ రకమైన చర్యలు తీసుకోవాలి. భవిష్యత్తులో యీ అపాయం జరుగకుండా వుండేదానికి యే రకమైన జాగ్రత్తలు తీసుకోవాలి అనేది ముఖ్యము. తాడు తెగినదనే వార్తలు వస్తున్నాయి. రెండు పడవల మీద కాళ్ళు పేసుకొని కూర్చునివున్నారనె ఒక ఉపమానం వాడుతుంటాము రెండు పడవల మీద కాళ్ళు పేసుకొని కూర్చుండే పరిస్థితి ఎలావుంటుంది. రెండు పడవలకు కట్టిన తాడు తెగడం జరిగినట్లయితే అసలు ఉద్యోగస్థులు ఎంత జాగ్రత్తతీసుకొంటున్నారనేది స్పష్టము అవుతుంది. మూడవ విషయం మంత్రిగారు చాలా తేలికగా దాటవేశారు. అది కూడా అంగీకరించలేక పోతున్నాను. ప్రతి సంవత్సరం డబ్బు irregular గా వసూలుచేసే పద్ధతి వుందని ఆఫీసరులు చెప్పినారని మంత్రిగారు చెప్పారు. ఆ నిజము చెప్పడము చాలా సంతోషం. అయితే యీ రకంగా సాగిపోవడానికి కారణము ఏమిటి. ఇన్ని సంవత్సరములనుంచి ఈ irregular collection జరిగేటప్పుడు తగిన చర్యలు ఎందుకు తీసుకొనలేదు ఈ సంవత్సరం కూడా ఈ దుర్గతికి కారణము irregular collection వల్లనే కదా. చార్జీలు గోదావరి మధ్య వసూలుచేయడానికి అవకాశం యివ్వడానికి కారణములను పరిశీలించినపుడు యిదివరకటి నుంచి అక్కడ ఉన్న ఉద్యోగస్థులుచేసే పనులను పరిశీలించి తగిన చర్యలు తీసుకొనక పోవడమే కారణము. ఈ రకమైన విచారణలు, ఉద్యోగస్థుల మీద మనం consult చేసే విషయాలు వచ్చేటప్పటికి అవి ప్రశ్నార్థకములుగా తయారై, ఆ రిపోర్టుతో ఏకీభవించుటక. అవకాశము యిచ్చుటలేదు. కనుక యీ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలనచేసి సరియైన చర్యలు తీసుకొని ముందు ఇటువంటివి జరుగకుండా చేస్తారని కోరుతున్నాను.

*శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు.—అధ్యక్షా, మంత్రి పట్టాభి రామారావుగారిచ్చిన వివరాలన్ని సరియైనవే. వారు దుమ్ముగూడెం దగ్గర ఉన్న లాకుకు సంబంధించిన Books Seal చేశారని ఒక విషయము చెప్పారు. రెండురోజుల క్రితము వర్షము వచ్చి వున్నట్లయితే నీటి యొక్క రంగును బట్టి విచక్షణచేసి వుండవచ్చు. అది నిలువవున్నదా, లేక రెండురోజుల క్రితవు కొండల మీద వర్షముపడి ఆ నీరువచ్చి కలగలుపుగా వున్న నీరా అని ఒకసారి విచక్షణచేసి వున్నట్లయితే ఆ Lock Superintendent తప్పు వుందోలేదో కూడాతెలిసేది ఇప్పుడైన కమిటీని వేసినప్పుడు దానిని తేల్చవలసినది అని వినయపూర్వకముగా కోరుతున్నాము. సాయంత్రము ఆరుగంటల, ఉదయము ఆరు గంటల మధ్యను గోదావరి నదీ మీద పడవలుగాని, లాంచీలుగాని నడువకూడదని వున్నట్లు నాకు జ్ఞాపకము. ఇప్పటికి రాజమండ్రి నుంచి 6 గంటలు దాటిన తరువాత ఆటు కొవ్వూరుకు ఇటు బొబ్బర్లంకకు రేవు పడవలు, లాంచీలు ఇంకా నడుస్తూనెవున్నవి. తరువాత తెల్లవారుజామున 3, 4 గంటల మధ్య పడవలు గట్టుకొని

లాంచీలు భద్రాచలం రోజూ ప్రయాణం చేస్తున్నాయి కనుక ఇవి ఇక ముందు జరుగకుండ చేయవలసినది అని అసువులు కోల్పోయినవారి ఆత్మలకు శాంతి కలుగుగాక అని ప్రార్థిస్తూ విరమిస్తున్నాను.

شری میر احمد علی خان :— جناب صدر - ہمارے آندھرا دیش میں پچھلے تین سال سے اس قسم کے واقعات ہورہے ہیں - پہلا جنگاؤں کا - دوسرا جڑ چرلہ کا - اور تیسرا بھدرا چلم کا - یہ جو واقعات ہوئے وہ ہم سب کے لئیے دکھ کا باعث ہیں - لیکن بھدراچلم کا واقعہ تو پچھلے دو واقعات سے بڑا واقعہ ہے - جہاں تک جانی نقصانات کا تعلق ہے اس حادثہ میں زیادہ نقصان ہوا ہے - اور اس میں عورتوں کی زیادہ تعداد شکار ہوئی ہے - اگر یہ قیاس کیا جائے کہ مسافرین نے رش (Rush) کرکے کستی میں سوار ہونے کی کوشس کی اور مستاجر یا کنٹراکٹر کو کستی چلانے پر مجبور کیا تو یہ بات صحیح نہیں ہوسکتی - اگر ایسا ہوتا تو اس میں مردوں کی تعداد زیادہ ہوتی کیونکہ عورتیں کبھی رش میں نہیں جاتیں - یہ اون کی (کنٹراکٹر) رضامندی سے ہوا ہے - اس وجہ سے مستاجرین اس الزام سے نہیں بچ سکتے - یہ بھی معلوم ہوا ہے کہ کستیوں میں پانی آگیا تھا - یہ چیز کستیوں کے ناقص ہونے کی دلیل ہے - ہمارے تلنگانہ میں بھی کئی مقامات پر ٹوکرے چلا کرتے ہیں اون کی بھی حالت ناقص ہوا کرتی ہے - مجھے بھی ان ٹوکروں میں بیٹھنے کا اتفاق ہوا تھا ان کی حالت نہایت ناقص رہتی ہے - آج سے سو برس پیشتر جو طریقہ تھا سائنٹیفک ایجادات کے باوجود بھی وہی پرانا طریقہ اختیار کیا جارہا ہے - اس کی روک تھام ہونا چاہیئے کیونکہ ابھی ایک سال کا عرصہ ہوا کہ تلنگانہ (ضلع عادل آباد) میں ایک ایسا ٹوکرا تباہ ہوا جس میں عورتوں کی جانیں زیادہ تلف ہوئیں - ان واقعات کے پیش نظر حکومت کو یہ چاہئے کہ ان کی تحقیقات کرے اور جن جن مقامات پر ٹوکروں کا استعمال ہوتا ہے وہاں مستاجرین پر شرائط عاید کئے جائیں -

دوسری چیز یہ ہے (جیسا کہ کیرالا کے گورنر بی رام کشن راؤ صاحب نے سجسٹ کیا ہے) کہ یہاں ایک پل تعمیر کیا جانا چاہیئے - بھدرا چلم ہمارے ملک میں ایک مقدس مقام ہے جہاں ہر سال کئی ہزار لوگ جاتے ہیں لہذا حکومت اس پر غور فرمائے کہ جب ہم اتنی تباہ حالی دیکھ رہے ہیں تو کیوں نہ فوراً ہی ایک پل تعمیر کیا جائے تا کہ اس سے ہم سب کو سہولت حاصل ہو - اس موقعہ پر جن لوگوں کی جانیں گئی ہیں ان کے پسماندگان سے اظہار ہمدردی کا رزولیوشن تو پہلے ہی پاس کیا جاچکا ہے اور جن لوگوں کی جانیں تلف ہوئی ہیں انہیں تو پرماتما ضرور بیکنٹھ باشی کریگا - ہم مسلمانوں میں یہ اعتقاد ہے کہ مکہ شریف کو جاتے ہوئے یا آتے ہوئے جو لوگ مرجاتے ہیں وہ شہید کا مرتبہ پاتے ہیں - اسی طرح بھدرا چلم کا حادثہ سری رام نومی جیسے متبرک موقعہ پر ہوا ہے اور اتنے لوگوں کی جانیں تلف ہوئی ہیں تو ان لوگوں کی

قربانی کو پیش نظر رکھتے ہوئے جہاں کہیں ٹوکرے اور ناؤ چلتے ہیں وہاں ایک ایک پل کی تعمیر فوری طور پر شروع کی جائے۔

ان الفاظ کے ساتھ میں معزز ایوان کے احساسات میں شریک ہوں۔

*శ్రీ కె. సుదర్శనరావు. (పాల్వంచ).—అధ్యక్షా, ఈ దుస్సంఘటన జరిగినందుకు అందరము విచారిస్తున్నాము. కేవలం విచారించినంత మాత్రముననే ఏ సమస్యా పరిష్కారం కాదు. జరిగినదేదో జరిగినది. ఇకముందు ఇట్టి దుస్సంఘటనలు జరుగకుండా ఉండడానికి గట్టి చర్యలు తీసుకోవాలి. శ్రీరామనవమి సందర్భములో భద్రాచలమునకు అనేకమంది యాత్రికులువస్తారు. అందరికీ తెలిసిన విషయమే ఇది. ప్రతి సంవత్సరమూ వస్తారు. 7, 8, 9 తారీఖులలో నేను కొత్తగూడెములో ఉన్నాను. ప్రతి సంవత్సరంకన్న ఈ సంవత్సరం ఎక్కువ మంది వచ్చారు. ఆ విషయం అక్కడ ఉన్న ఉద్యోగస్థులకు తెలుసును. అవసరమైన చర్యలను మొదటనే తీసుకొనవలసియున్నది. ఎక్కువ సంఖ్యలో పడవలను వేయడం, పోలీసు సిబ్బందిని ఎక్కువగా ఉంచడం ఇవన్నీచేసి ఉండవలసింది. అవసరమైతే పడవలలో పోలీసు కానిస్టేబుల్సు ఉండి చార్జీలు ఎక్కువగా వసూలుచేయకుండాను రద్దీ ఎక్కువలేకుండా చూడవలసియుండెను. అది జరుగలేదు. ఇకముందు ఆ విధంగా జరపడానికి ప్రయత్నంచేస్తారని ఆశిస్తాను. అక్కడ గోదావరికి ఒక బ్రిడ్జి కడితే దారి క్రమంగా ఏర్పడుతుంది. ఒకవైపు భద్రాచలం ప్రాంతం, మరొకవైపు పాల్వంచ ప్రాంతం యున్నది, అక్కడ కోయలు, చాలా పేద ప్రజానీకముఉన్నారు. అక్కడ వంతెన నిర్మించడంవల్ల పేదప్రజానీకానికి tribes కు ఉద్యోగం కల్పించినవారము అవుతాము. ఒక పుణ్యక్షేత్రానికి సరిఅయిన మార్గం చూపించినవారము అవుతాము. ప్రతి సంవత్సరము వచ్చే వందలు, వేలాది యాత్రికులకు సౌకర్యాలుచేసినవారము అవుతాము. అందుచేత ఆ రకంగా చేయవలెనని కోరుతున్నాను. చనిపోయినవారి ఆత్మలకు శాంతిచేకూరవలెనని కోరుతున్నాను.

*శ్రీ ఎన్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం—జనరల్).—అధ్యక్షా, యావదాంధ్ర ప్రజానీకాన్ని ఒక్కసారిగా విచారసముద్రంలో ముంచిన దుస్సంఘటన ఇది. ఆంధ్రప్రదేశ్‌లో చాలా చోట్ల పెద్దపెద్ద పుణ్యక్షేత్రాలు ఉన్నాయి. అందులో భద్రాచలం చాలా గొప్ప క్షేత్రం. వేలాది యాత్రికులను భక్తులను, ఆకర్షించే గొప్ప పుణ్యక్షేత్రమది. ఇలాగే అంతర్వేది కూడా చాలా పెద్ద క్షేత్రం. దానికి కూడా నదీ, సముద్రం దాటవలసియున్నది. ఇలాంటి క్షేత్రాలు అనేకం ఉన్నాయి. ఇంకా పుష్కరాలు వస్తుంటాయి. ఈ దుస్సంఘటన ఏ కారణాలవల్ల జరిగినా మనం చేసే చర్చలో అంతా సమీక్షించి, ఏ చర్యలు, ఏ ఉపాయాలవల ఇటువంటి ప్రమాదాలను నివారింపవచ్చునో విచారణచేసి నిర్ణయించుకుని, ఆ ప్రకారం మన కార్యక్రమాన్ని నడిపించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. కొద్ది నెలలలో కృష్ణా పుష్కరం వస్తుంది. లక్షలాది జనం పుష్కరానికివస్తారు ఈ అనుభవాన్ని పురస్కరించుకుని అయినా వెంటనే పెద్ద స్కేలుమీద అక్కడ ఏర్పాట్లు చేయవలసియున్నది. నదిలోనుంచి దాటేవారికి పోలీసు బందోబస్తు, ఆరోగ్యశాఖవారు చేయవలసిన ఏర్పాట్లు అన్నీ సమగ్రంగా చేయవలసియున్నది. 8వ తారీకుననే కళ్యాణం జరుగుతుందనేఉద్దేశ్యంతో చాలా మందివెళ్ళారు

కళ్యాణం 9వ తారీఖున జరిగింది. తొందరపాటువల్ల, భద్రాద్రి పట్టణంలో సరిఅయిన తిండి సౌకర్యాలు నివాస సౌకర్యాలు ఉండకపోవడంవల్ల, పర్ణశాల మొదలైన ప్రదేశాలకు వెళ్ళడానికి బస్సు సౌకర్యాలు లేనందువల్ల ఎక్కువమంది ప్రయాణీకులు ఉష్ణగుండం, పర్ణశాల చూడవలసి యున్నప్పటికీ, వెనువెంటనే వెనుకకు తిరిగిరావడం జరిగింది. భోజన వసతులు నివాసానికి ప్రత్యేకమైన క్యాంపులు ఏర్పాటుచేయవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. ఈ విషయాన్ని విచారించే నిమిత్తమై ఒక హైకోర్టు న్యాయమూర్తి అధ్యక్షునిగా కమిటీని వేయవలసిన అవసరం లేదని నేను అనుకుంటున్నాను. ఎక్కువ విషయాలు ఇప్పుడే చర్చించబడ్డాయి. ఇంకా లోతుగా విచారించి, తప్పు ఎవరిదనే విషయం నిర్ణయించి, ఇకముందు ఇట్టి విపత్తులు జరుగకుండా చేయవలసిన కార్యక్రమాన్ని నిర్ణయించే నిమిత్తం ఒక అనధికార సంఘాన్ని నియమిస్తే చాల నుకుంటాను. ఈ శాసనసభలోనే సమర్థులైన న్యాయవాదులనేక మంది ఉన్నారు వారిలో ఒక్కరిని అధ్యక్షునిగావేసి బాధ్యత తీసుకోవలసిన వారుండాలి కాబట్టి Inspector General of Police, Chief Engineer నుకూడా కలిపి అనధికార సంఘాన్నివేసి విచారణచేయిస్తే సరిపోతుంది అని నేను ఊహిస్తున్నాను. అదే నా సూచన. ఈ ప్రమాదంలో అనేక బీదవారు అనాధలు ఉంటారు. వారికి తగు ఆర్థిక సహాయంచేయడం అవసరం. పడుచువారుపోయి ముసలివారు మిగిలిఉంటారు. తల్లి దండ్రులుపోయి పిల్లలు మిగిలి ఉంటారు. వేరే ఏ దిక్కూలేని వారుంటారు. ఇటువంటి వారికి ఆర్థికంగాను ఇతరంగాను సహాయంచేయవలసిన అవసరం ఎంతైనాఉన్నది. ఈ ప్రమాదానికి గురిఅయిన వారిలో యావదాంధ్రకు సంబంధించినవారున్నారు. అన్ని జిల్లాలవారూ ఉన్నారు. ముఖ్యంగా మా పశ్చిమ గోదావరి జిల్లాకు సంబంధించినవారు చాలామంది చనిపోయారు. నా నియోజకవర్గంలో ఏలూరు తాలూకాలోని తిమ్మాయపాలెం అనే గ్రామంలో పింఛాడి సత్యనారాయణగారనే పెద్ద కుటుంబీకుడు, మంచి రైతు, ఈ ప్రమాదంలో యావత్ కుటుంబంతో చనిపోయారు. ఒక్క కొడుకు మాత్రం మిగిలినాడు. యావదాంధ్రకు సంబంధించిన విషాద సంఘటన ఇది. చనిపోయినవారి పేర్లున్నాయి. వారందరి కుటుంబాలకు సానుభూతి తెలియజేయవలసియున్నది. చనిపోయినవారందరి ఆత్మలకు భగవంతుడు శాంతి చేకూర్చాలని ప్రార్థిస్తున్నాను.

*శ్రీ కొత్తూరు సీతయ్య గుప్త (ముషీరాబాదు): అధ్యక్షా, భద్రాచలం దగ్గర గోదావరి నదిలో జరిగిన యీ దుస్సంఘటన చాలా విషాదకరమైనది. ఇందులో ముఖ్యంగా ఆలోచించగా తేలిన కారణాలు రెండు. పడవలుచాలా పాతవి కావడం, అక్కడ యీస్టేషనులో వున్న పోలీసు వారు గట్టి చర్యలు తీసుకోకపోవడం. అందువల్ల పడవ యజమానులు ఎక్కువ డబ్బు తీసుకుని చాలమందిని ఎక్కించే ప్రయత్నం చేసారు ఆ విధంగా ఎక్కువ మందిని ఎక్కించినందువల్లనే యీ దుస్సంఘటన జరిగిందని తాత్పర్యం అక్కడ పోలీసుకాన్స్టేబుల్సు చాలా corrupt minded అని మనవి చేస్తున్నాను. ఇక్కడనే కాకుండా అన్ని చోట్లా కానిస్టేబుల్సు ఇట్లాగే చేస్తున్నారు. ఈ డిపార్టుమెంటు అధికార్లపైన తప్పుని సరిగా చర్య తీసుకోవాలని చెబుతున్నాను. అక్కడ నిగరాణీ చేసేవాళ్లు సరిగా నిగరాణీ చేస్తే పడవవాళ్లు ఏమాత్రము సాహసం చేసి డబ్బు ఎక్కువ తీసుకోక పోదురు. ఈ రెండు కారణాల చేత యీ దుస్సంఘటన జరిగింది. ఈ నిగరాణీదారులు డబ్బు పంచుకుంటారు. లేకుంటే పడవ యజమానులీసాహసం

చేయరు. ఇంతకుముందు యిటువంటి దుస్సంఘటనలు జరిగినవి కాని ఇది చాలా పెద్ద దుస్సంఘటన, రైల్వే ప్రమాదములు రెండింటిలో 200 మంది 160 నుండి చనిపోతే చనిపోయిన వారి కుటుంబములకు నష్టపరిహారం Compensation ఎంతో యిచ్చారు. కాని యిక్కడ చనిపోయినవారి కుటుంబాలకు కూడా రైల్వేవారిచ్చినంతకాక పోయినా కొంతయినా ప్రభుత్వం నష్టపరిహారం యిచ్చి సహాయంచేయాలని మనవి చేసుకుంటున్నాను. ఇంతటితో నేను విరమిస్తున్నాను.

*శ్రీ బసవ మానయ్య (ఆందోల్) :—గౌరవనీయులైన అధ్యక్షా, ఇప్పుడు భద్రాచలం దగ్గర గోదావరి నదిలో జరిగిన దుస్సంఘటనను గురించి మన మంత్రులు, గౌరవనీయులైన సభ్యులు చాల విషయాలు తెలిపారు. విచారపడ్డారు. ఆత్మశాంతికి భగవంతుని ప్రార్థించారు వారికి ఆర్థిక సహాయం కావాలని కోరారు. జనగామ్, జడ్చర్ల, . కుంభమేళ, మొదలైన దుస్సంఘటనల విషయంలో కూడా యిదే రీతిగా జరిగింది. అసలు దీనికి కారణాలైన కీటుకులు గట్టిగా వాక్కితేనే యింటువంటివి జరుగకుండా వుంటాయి. మన దేశ స్వాతంత్ర్యం వచ్చిన తరువాత వరుసగా దుస్సంఘటనలు జరిగినాయి. సాధారణంగా పల్లెటూర్లలో అంగడి నడిస్తే! పదిమంది కాన్స్టేబుల్సు పోతుంటారు. భద్రాచలం వంటి పవిత్రమైన స్థానంలో జరిగిన ఉత్సవ సందర్భంలో ఎక్కువ మంది పోలీసు బందోబస్తు చేయించివుండాలి. ప్రభుత్వపుటుత్తరువుల ప్రకారం ఎంత బందోబస్తు చేయాలో నిర్ణయించి వుంటుంది. పడవలలో Capacity కంటె ఎక్కువ ఎక్కారు. పడవలలో ఎంతమందికంటె ఎక్కువ ఎక్కకూడదో లైసెన్సులో స్పష్టంగా వుంటుంది, అయినప్పటికి ఎక్కువ మందిని ఎక్కించినా చూచి పోలీసులు ఊరుకోవడం రెండు పడవలను జతకట్టడం దానికి అక్కడి అధికార్లు ఊరుకోవడం, నీటిపారుదల అధికార్లందరూ అక్కడవుంటే కూడా యిదంతా జరుగుతూవుంటే ఒప్పుకున్నట్టు మంత్రి గారు శలవిచ్చారు. ప్రతిసంవత్సరం యిదే తీరుగా overload ఎక్కువగా ఎక్కి పోతుంటారని ఊరుకుంటే rules ఏ విధంగా అమలు జరుగుతవి ? జనగామ్ రైలు ప్రమాదంలో 100 మంది చనిపోతే 50 మందిని డిస్మిస్ చేశారంటే మళ్ళా యిట్లాకాదు. పెద్ద చదువులు చదువుకున్నవారే ఉద్యోగాలలో జీతాలు తీసుకుంటూ బాధ్యతలను మరచి చట్ట విరుద్ధంగా ప్రవర్తించిన ఫలితంగా యీ దుస్సంఘటన జరిగితే సంతాప సభలు పెట్టి చెప్తే పోతుంటే యీ అక్రమాలకు అంతం ఉండదు. కనుక 200 మంది చనిపోయారంటే బాధ్యత గల ప్రభుత్వోద్యోగులను 100 మంది పైనా డిస్మిసు చేస్తే యిక ముందు మిగిలినవారు జాగ్రత్త పడతారు. ఫలానా ఆనకట్ట యీ విధంగా వుందని ఫలానా అప్పుడు పడిపోతుందని ముందుగానే ప్రభుత్వానికి తెలుపుకుంటారు. ఒక సంవత్సరం ముందే వ్రాసుకుంటారు. ఈ విధమైన చర్య తీసుకోవలసినదని పూజ్యులయిన అధ్యక్షుల ద్వారా ప్రభుత్వమునకు మనవి చేసుకుంటున్నాను. దీనిమీద వారియొక్క ప్రత్యేకమైన దృష్టిని కేంద్రీకరించి చర్య తీసుకుంటారని నమ్ముతూ విరమిస్తున్నాను.

*శ్రీమతి వై. సీతాకుమారి (బన్నవాడ) :—ఇప్పుడు విద్యామంత్రిగారు యితర గౌరవ సభ్యులుచెప్పిన వివరాలను బట్టి కళ్యాణ సమయములో ఏర్పాట్లు చాలా బాగావున్నట్టు గోదావరిని దాటించడానికి మాత్రం ఏర్పాట్లు బాగులేనట్టు తెలుస్తున్నది. ఇక ముందునుంచే ఆ ప్రయత్నాలను

కూడా ప్రభుత్వము వారే తీసుకొని గోదావరిని దాటించడానికి ఏర్పాట్లు బాగా చేయవలసినదని కోరుతున్నాను. తరువాత అధిక సంఖ్య స్త్రీలు చనిపోయినారని తెలుస్తున్నది. అందుకు నా విచారాన్ని ప్రకటిస్తున్నాను. ఐతే, కొందరు రక్షించబడిన స్త్రీలకు తాత్కాలికంగా సహాయం చేసినట్లు విద్యా మంత్రిగారు చెప్పారు. ముఖ్యంగా బంధువులను భర్తలను కోల్పోయిన స్త్రీలకు శాశ్వతమైన జీవనాధారాన్ని ఏర్పాటు చేయించడానికై ముందు ఏర్పడబోయే కమిటీలలో ప్రయత్నం చేయాలని మనవి చేస్తున్నాను.

*శ్రీ నీలం సంజీవరెడ్డి (ముఖ్యమంత్రి) :—అధ్యక్షా సభ్యులు యిచ్చిన సలహాలు, చేసిన సూచనలు విన్నాము. అందులో యిలాంటి విషయాలలో అభిప్రాయ భేదం ఉండడానికి వీలేలేదు. ఎవరు ఏ పార్టీవారని కాదు. ఇలాంటి విషాద సంఘటనలు జరిగినప్పుడు అలాంటివి జరుగకుండా ఉండడానికి లేదా అలాంటి సంఘటనలు జరగడానికి బాధ్యతలు గలవారని శిక్షించడానికి పార్టీ తారతమ్యాలు రావు. అందరు జేసిన సలహాలను పాటించి తగు చర్య తీసుకోడానికి ప్రభుత్వం సిద్ధంగా వుందని మాత్రం నేను చెబుతున్నాను. ఇలాంటి సలహాలు చేసేటప్పుడు శాసన సభ్యులుగా, ప్రజా ప్రతినిధులుగా మాత్రమే భావించాలికాని పార్టీ ప్రయోజనాలకు ఉపయోగపరచుకోకూడదని మాత్రం నేను ప్రార్థిస్తున్నాను. ఆ భావంతో మనం యిలాంటి సమస్యలను పరిశీలన చేస్తే ఏరకంగా ఎవరు విచారించాలి, ఎవరిని శిక్షించాలి, అనేవి సులభంగా తేలిపోతాయి. ఇన్ని నిండు ప్రాణాలు నీట కలిసిపోతే అక్కడున్న ఉద్యోగస్తులను రక్షించాలని ప్రభుత్వం ఏనాడూ ఆశించదని నేను చెబుతున్నాను. కాని యిలాంటి విషాద సంఘటనలను కూడా పార్టీ ప్రయోజనాలకు ఉపయోగించడానికి చేసిన ప్రయత్నాలు చూస్తువుంటేనాకు చాలా విచారమైనది. ఇంత మంది చనిపోతే చనిపోవడానికి గల కారణాలు కనుక్కోడాని ఉపేక్షణ లేదు. ఉద్యోగస్థులను శిక్షించడానికి సిద్ధంగా వున్నాను. చిన్న విషయాలలో యీ సంఘటనను ఉపయోగించుకొని ఎవరో మంత్రులకు బంధువులు అక్కడ వున్నారనో, యీ కంట్రాక్టరుకు ఏ మంత్రో ఉపయోగ పడ్డారనో యింత నీచమైన ప్రచారానికి పాల్పడినప్పుడు నాకు చాలా బాధ కలిగింది. పత్రికలలో యీ రకంగా వ్రాతలు వ్రాస్తూ నిండు ప్రాణాలు పోయిన వారందరినీ, వారి చావులను ఉపయోగించుకొని పార్టీని బలపరచుకోవాలని ప్రయత్నం చేసిన కొన్ని పత్రికలను వ్యక్తులను మాత్రం చూసినప్పుడు నేను సంకుచిత మనస్తత్వమునకు విచారపడుతున్నాను. అక్కడ వున్న వుద్యోగస్తులను సమర్థించటానికి నేను ఇక్కడ లేను ఉద్యోగస్తులెవరో, ఎంతవరకు వారి తప్పిదమో విచారించాలి. వారు ఎందరైనా కానివ్వండి 100 మంది అని బసవ మానయ్యగారు చెప్పారు. 100 కాకపోతే 200 మంది కానివ్వండి కానిఎంతమందయినా నేరస్థులని నిరూపించిన తరువాతనే వారిని శిక్షించాలి. ఇప్పటికప్పుడే అక్కడవున్న సర్కిల్ ఇన్స్పెక్టర్‌ను Suspension లో పెట్టారు. పడవ నడుపుతున్న వారిని, కంట్రాక్టరును, మిగిలిన వారిని అరెస్టు చేశారు, ప్రభుత్వము, మంత్రులు, వారిని శిక్షించటానికి వీలులేదు. వారిపై కేసుపెట్టాలి. కేసు విచారణను, న్యాయమూర్తుల దగ్గరకు పోవాలి. వారు నేరము చేశారని నిరూపించిన తరువాతనే పడవవాళ్ళపైనా, కంట్రాక్టరుపై, నాశిక్షించాలి కంట్రాక్టర్లు ఎవరో మాకు తెలియదు, తూర్పు గోదావరి జిల్లా బోర్డు వారిచ్చిన కంట్రాక్టరు ఒకరు. ఇక్కడ, తెలంగాణా ప్రాంతములో ఖమ్మం జిల్లాలోని ఒక గ్రామ పతినిధియొక్క కంట్రాక్టర ఒకరు. వారు మరల సబ్ కంట్రాక్టర్లకు ఇచ్చారు. ఎవరు కంట్రాక్టర్లు అయినా సరే,

ఎన్ని వేల యాత్రికులను చిల్లి పడవలో వుంచి నడిపించటము మనిషి యొక్క ఆశకు మేర లేదని నిరూపించటానికి ఈ నిదర్శనము చాలు. ఆడవాండ్రను, బిడ్డలను, పసిపిల్లలను చిల్లిపడవలో ఎక్కించి నదీ గర్భములో కలిపే మానవత్వం నశించిన మనిషి ఆశకు పరిమితి లేదు. అలాంటి వారు అక్రమ చర్యలు చేస్తున్నప్పుడు చూస్తూ గమనించకుండా వున్న ఉద్యోగస్తుల అలసత్వము కొందరు Corruption అంటున్నారు. ఏదైనా కావచ్చు, ఏదైనా సరే రుజువు అయితే శిక్షించవలసినదే. ఇలా అనేక కారణాలువున్నాయి. ఇందులో ఏమి కాదనటానికి వీలులేదు. చిల్లి పడవకాదని ఎవరూ అనటము లేదు. కంట్రాక్టరు సక్రమముగా పనిచేశాడని ఎవరూ అనటము లేదు. 'పోలీసు ఉద్యోగస్తులు క్యూ ఏర్పాటు చేసి అంతా సక్రమముగా చేశారు, కాని అది ఏదో జరిగింది' అని నేను ఉపన్యాసము ఇవ్వటానికి సిద్ధంగా లేను. పడవలు చిల్లివి. కంట్రాక్టర్లు అతి ఆశతో ప్రవర్తించినట్లు కన్పిస్తోంది. ఉద్యోగస్తులు సరిగా పని చేయలేదు. వారు సక్రమముగా పని చేసివుండి క్యూ ఏర్పాటు చేసివుంటే నాల్గు వేలమంది ఒక్కసారి పడవలలోకి దూకటానికి వీలువుండేది కాదు. నాకు ఎవరినీ సమర్థించ అవసరములేదు. కొందరుజూడీషియల్ కమిటి అవసరం అన్నారు. మరికొందరు అది అక్కరలేదు Non-Official Committee వేయాలి అన్నారు. ఇక్కడవున్న ప్రతినిధులలో ఒక Non-Official Committee వేస్తామనుకొన్నాము. కాని ఈ సంఘటనను పురస్కరించుకొని, మంత్రులపైనా, కాంగ్రెసుపైనా ప్రచారము ప్రారంభించిన పార్టీయొక్క దృక్పథము చూచిన తరువాత నాకు విచారము కల్గినది. ఈ దృక్పథములోనే వారక్కడను పోతే అక్కడ న్యాయాన్ని పరిశీలిస్తారా? లేని వికల్పించటానికి ప్రయత్నిస్తారా? లేని వికల్పించి, మంత్రిగారికి కంట్రాక్టరు బంధువు కాబట్టి ఇట్లా చేశారని అన్నవారు ఆ విధంగా చేస్తారేమో ననే భయము నాకు వుంది కాని నేను భయపడితే లాభము లేదు. ఎవరికి ఎక్కడ న్యాయము జరగాలో, అక్కడ న్యాయబుద్ధితో పరిశీలిస్తారని, వారి సహాకారము తీసికోవాలని ఆశయము. నేను ఢిల్లీపోక మునుపు ఈ ఏర్పాటు చేద్దామనుకొన్నాను. కాని అధ్యక్షులవారి ఆజ్ఞపై 17 వ తేదీ డిబేటు జరుగుతుంది కాబట్టి, అందులో ఈ కమిటీని ఏర్పాటు చేసి 1, 2 రోజుల్లో విచారణ చేసే ఏర్పాటు చేయాలని అనుకొన్నాము. దుమ్ముగూడెం ఆనకట్టవద్ద నీరు అదే పనిగా వదిలినారని కొందరు, లాకు పుస్తకము చూచాము కాని అట్లాంటిది లేదని కొందరు చెప్పారు. గోదావరిపై అనుభవము వున్న వెంకట్రామరాజుగారు అలానే చెప్పారు.

ఇర్రిగేషన్ అనుభవము నీటి అనుభవము, నదుల అనుభవము వున్నవారు, అన్ని విషయములలోను ఆంధ్రదేశములోనేకాదు, భారతదేశములోనే అన్నీ విచారించటానికి తగినవారు, వెంకటకృష్ణయ్యగారని నా భావం. ఆయన ఛీఫ్ ఇంజనీరు. అక్కడ బోటు వాడిని రక్షించాలని ఆయనకు వుండదు. అక్కడవున్న కంట్రాక్టరు ఆయన ఆప్తుడుకాడు. దుమ్ముగూడెములో వున్న సూపర్‌వైజర్ బంధువుకాడు. టెక్నికల్‌గా యిలాంటి subjects మీద opinion ఇవ్వటానికి వెంకటకృష్ణయ్యగారిని పంపుదాము. అక్కడవుండే ఆఫీసరు ప్రయాణీకులకు ఇబ్బంది కల్గించటానికి నదిలో నీరువదలి పెడితే, చట్టం allow చేస్తే అతనిని Hang చేయవచ్చు. కాని allow చేయదు కాబట్టి అతనిపై కేసు పెట్టవలసి వుంటుంది. కనుక అతనిని రక్షించాలన్న అవసరం వెంకట కృష్ణయ్యగారికిగాని, మీకుగాని, నాకుగాని లేదు. ఈ బోట్లు ఎలా వున్నాయి? ఈ బోట్లను Irregular గా నడిపించారా? లేదా

అని చూడటానికి authority అయిన కనుక వెంకట కృష్ణయ్యగారిని పంపమని అధ్యక్షుల వారిని కోరుతున్నాను.

నాకు వచ్చినరిపోర్టునుబట్టి వర్షం వచ్చినది నిజమే. వాగులువస్తే గోదావరిలో నీరు పెరుగు తుందని మిత్రులు కోదండరామయ్యగారు కూడ చెప్పారు. చూస్తూవుండగానే పెరుగుతుంది గోదావరి. అంతేకాని దుమ్ముగూడెములో నీరు వదిలితారా? లేదా? వదిలితే ఎంతకాలానికి వస్తుంది. అనేది ప్రశ్నకాదు. వర్షంవచ్చిన మాటనిజమే. వాగులు వచ్చినమాట నిజమే. కొందరికిఏవో అభిప్రాయాలు వున్నాయి. అవన్నీ ఇప్పుడు చర్చించ దలచలేదు. ఎన్నో ఏండ్ల నుంచో ఈ భద్రాచలజాత్ర జరుగుతోంది. వేలమందివచ్చి పోతున్నారు. ప్రతిసంవత్సరమునడచి పోయేవారట. అందుచేత ప్రమాదాలుజర్గిగేవికావు. నేడు ప్రమాదంము జరిగింది. వారిదుర దృష్టము. దేశదురదృష్టము. వారి ప్రాణము పోవలసియున్నది కాబట్టి ఏకారణంచేతగాని దుమ్ముగూడెమువద్ద వరద రావటమువలన అయితేనేమి, ఏదైతేనేమి ప్రమాదము జరిగింది. దానికి బాధ్యులెవరో తెల్సుకోవటానికి పరిశీలన చేయాలని చెబుతున్నాను. ఈ కమిటీలో చీఫ్ ఇంజనీరు వున్నట్లయితే ఈ రకమైన ప్రమాదాలు జరుగకుండా ఈ రకంగా చేస్తే బాగుంటుంది అన్నిటికి టెక్నికల్‌గా advise ఇవ్వటానికి వారుగూడా కమిటీలో వుండటముమంచిదని భావిస్తున్నాను. ఇతర పార్టీలవారు ఏరకమైన విమర్శలు చేసినా వారిలో ఒకరిని, పార్లమెంటు సభ్యులలోనొకరిని ఈ కమిటీలో ప్రతినిధిగా వేయాలనివుంది. శ్రీ రామకృష్ణ రాజుగారు తేరిక్కడ వారిని అడుగలేక పోయాను. వారు Independent Party వారు. కాంగ్రేసుసభ్యుడు కాక పోయినా Independent Party లో ఉన్నారు, పెద్దలు, యిదివరలో కౌన్సిల్ చైర్‌మన్ గావున్నారు. లాయర్‌గా 40 ఏండ్ల అనుభవంగలిగి వున్నవారు. మనముపాలో చేరి తప్పి పోయ్యారుకాని లేకపోతే యోగ్యతలో, అనుభవములో ఆయన తక్కువకాదు. ఈరాజకీయా లలోకి రాకుండావుంటే ఈ పాటికి జిల్లా జడ్జిగా వుండేవారు. అధ్యక్షులుగా వుండమనిమా అందరితరపున వారిని ప్రార్థిస్తాము. మంత్రులను సంతోష పెట్టటానికి, మంత్రులను తృప్తిపరచ టానికి ఈ రిపోర్టు వ్రాయరు. మనసభ్యుని, పార్లమెంటు సభ్యుని పంపుతే పక్షపాతరహితంగా వారు రిపోర్టు వ్రాసినట్లుగానే అది అట్లావుండవచ్చు, ఇట్లా వుండవచ్చు, అనే రిపోర్టు వస్తుంది కనుక వారికి సహాయముగా ఉండటానికి techinical గా opinion ఇవ్వటానికి, దుమ్ముగూడెంవద్ద level ఎంతవున్నది, ఆనకట్టవద్ద ఎంతవున్నది. అని పరిశీలిలించటానికి 40 ఏండ్ల అనుభవమువున్న వెంకటకృష్ణయ్యగారిని పంపుదాము వారుకూడా కమిటీలో వుంటేనే ఉపయోగపడుతుంది కాని ఒక Judge ని వేస్తే పనిఏలా జరుగుతుంది? పోలీసు డిపార్టుమెంటు సక్రమముగా పనిచేసిందా లేదా అని విచారించటానికి I.G.P. ని కూడా ఈ కమిటీలో వేస్తున్నాము. I.G.P. కూడా అదే ఉద్దేశ్యంలో వున్నారు. ఎవరినా ఒక Currput Officer ను రక్షించటానికి I.G.P. బాధ్యత వహిస్తాడని నేను అనుకోను. Future లో ఏమిచేయాలి? ఎవరిని శిక్షించాలి అనేవిషయయాలు తెలపటానికి వారినిగూడా ఈ కమిటీలో వేస్తున్నాము.

చీఫ్ ఇంజనీరుగారికి ఐ.జి.పి., గారికి తెలంగాణా ప్రాంతములో అనుభవము లేక పోవచ్చును కాబట్టి తెలంగాణా ప్రాంతములో అనుభవము ఉన్న ఒక సీనియరు ఉద్యోగిని నియమించవలసిన

అవసరము ఉన్నది. రెవిన్యూబోర్డులో చాలకాలంగా ఉన్న ఒక సీనియర్ మెంబరును కూడా పంపుదామనుకొన్నాను. ఎన్ని మార్గాల వీలు అవుతుందో అన్ని మార్గాల సమాచారము సేకరించిన తరువాత ఎవరిని శిక్షించవలెనో చూచుకోవచ్చు. ఎవరినో ఒకరిని శిక్షించవచ్చు. ఏమైనప్పటికీ ఇక మీదట ఇలాంటి ప్రమాదము జరగకుండా ఉండే విధంగా ప్రభుత్వము చర్యలు తీసుకుంటుందని మాత్రము నేను చెబుతున్నాను.

ప్రమాదము జరిగిననాడు ఆ ప్రదేశంలో 130 మంది పోలీసులు ఉన్నారని తహసీలుదారు చెప్పారు ఐ.జి.పి. గారి రిపోర్టులో కూడా అంతే ఉన్నది. ఎగ్జాజిరేట్ చేయలేదు. చాల సంతోషము. తహసీల్‌దారు కూడా దాదాపు 130 మంది పోలీసులు అక్కడ ఉన్నారని చెప్పారు. అయితే సగము మంది విశ్రాంతి తీసుకొంటున్నారని అన్నారు. పోలీసులను అక్కడ పెడతాము. కాని వారు ఎక్కడ ఉన్నారో, చెట్ల క్రింద ఉన్నారో, ఇంకేపని చేస్తున్నారో, అచ్చట ఉన్న అధికారులు చూచుకోవాలి. ఏమైనా పోలీసులు అక్కడ ఉన్నారని కమ్యూనిష్టు పార్టీ సభ్యులు అయినవారే చెప్పారు. తహసీల్‌దారగారు శ్రీ పట్టాభిరామరావుగారు అక్కడకు పోయినపుడు అక్కడే ఉన్నారు. అయితే తరువాత వచ్చేశారు అనుకోండి. వాణీరమణ రావుగారు అక్కడనే ఉండి ఏదో చేస్తూ ఉంటే తహసీల్‌దారు వచ్చేశారు. శాసనసభలో చెప్పాలనే ఆదుర్దాతో వచ్చిరనుకొంటాను. ఏమైనా సరే, అక్కడ ఉండి రిలీఫ్ మెజర్సుతో పాల్గొనవలసిన తహసీల్‌దారుగారు చక్కగా హైదరాబాదుకు వచ్చారు. అదంతా వేరే విషయం.

అన్నిటికన్న ముఖ్యమైన సలహా శ్రీ సుదర్శనంగారు చెప్పారు. నాకు అది మనస్సులో ఉన్నది. రెండు మూడు రోజులుగా, ఈ ప్రమాదం జరిగిందనగానే మిత్రులు రామకృష్ణరావుగారు కేరళనుండి ఒక టెలిగ్రాం పంపించారు "నేను ముఖ్యమంత్రిగా ఉన్నరోజులలో అక్కడ బ్రిడ్జి కట్టడం ఆలోచనలో ఉండి ఉండినది. అది ఇప్పుడు ఏ రకంగా ఉన్నదో దయచేసి వెంటనే పరిశీలించవలసిందని" వారు టెలిగ్రాం యిచ్చారు. దాదాపు అలాంటి సలహా మిత్రులు సుదర్శనంగారు యిచ్చారు. కొత్తగూడెం ప్రాంతం నుంచి ఎన్నుకొనబడిన సభ్యులు వారు. బ్రిడ్జి కట్టడం యిప్పటికైనా పూనుకొండి అన్నారు. అయితే గోదావరి నదిపైన బ్రిడ్జి కట్టడం అంటే ఏ అయిదు లక్షలో పది లక్షలతో కాదు ఆ పని. కాని ప్రభుత్వము మాత్రము తీవ్రమైన కృషిచేసి మిగిలిన పనులు కుంటుపడ్డ సరే భద్రాచలము దగ్గర ఇలాంటి ప్రమాదాలు జరుగకుండా శాశ్వత నివారణోపాయంగా ఒక బ్రిడ్జి కట్టడం అవసరమని నాకు తోస్తున్నది. శక్తి వంచన లేకుండా ఇందుకు ప్రయత్నం చేస్తామని, అవసరమయితే ఢిల్లీ ప్రభుత్వానికి ఈ విషయం వ్రాసి ఈ ప్రమాదంలో ఆపదకు గురి అయిన రెండువందలు లేక 250 మంది జ్ఞాపకార్థం ఒక బ్రిడ్జి కడతాము కనుక మీరుసహాయం చేయండి అని తగినంత ప్రయత్నం చేస్తామని చెబుతున్నాము.

అన్నిటికన్న ముఖ్యమైన, ఒక విషయాన్ని మిత్రులు కృష్ణమాచారిగారు శ్రీమతి సీతా కుమారి గారు చెప్పారు. కారణములు ఏమైనా అయి ఉండవచ్చు. ఎవరినో శిక్షించవచ్చు. ఏదో జరుగుతుంది. కాని పోయినవారి కుటుంబాలకు తల్లిదండ్రులు తల్లులు పోయిన పిల్లలకు, భర్తలను పోగొట్టుకొన్న అనాథలకు కొడుకులను కోడళ్లను పోగొట్టుకున్న తల్లులకు, ఇటువంటి వారందరికి సహాయము చేయవలసి ఉన్నది. ఇటువంటివారు, పసిపిల్లలు ఎందరో ఉంటారు. ఇప్పటివరకు

ఇట్టివారికి ప్రభుత్వమువారుగాని, తదితరులుగాని చేసిన సహాయము తాత్కాలికము. భోజనము పెట్టడము, గుడ్డలివ్వడం, రైలుచార్జీలు ఇవ్వడం వంటివి తాత్కాలిక సహాయములే అవి శాశ్వత సహాయము కాదు. అయితే ఇలాంటి కష్ట పరిస్థితులలో తల్లితండ్రులను పోగొట్టు కున్న పిల్లలకు విద్యాబుద్ధులు చెప్పించే విషయంలో గాని, లేదా భర్తలను పోగొట్టుకొని ఆధారం లేకుండా నిలబడిన స్త్రీలకు సహాయం చేయడంలో గాని జంకుగొంకు లేకుండా కృషి చేస్తామని మనవి చేస్తున్నాను. ఆలాంటి విషయసేకరణ అయిన తరువాత సహాయం చేయడానికి ప్రభుత్వము పూనుకొంటుందనే హామీని కూడా నేను ఈ శాసన సభకు యిస్తున్నాను. ఇక తక్కిన విషయములను గురించి నేను ఎక్కువగా చెప్పదలచుకోలేను. నేను యీ దినము సాయంత్రం లోపలనే ఈ విచారణ సంఘంలో ఉండే సభ్యులపేర్లను ఎన్నొన్ను చేయడం జరుగుతుంది. సభ్యులు ఎక్కడ ఉన్నారో కనుగొని శ్రీ రామకృష్ణరాజుగారిని వెంటనే సంప్రదించి సాధ్యమైనంత త్వరలో రెండురోజులలోనా, మూడురోజులలోనా వారు విచారణ చేయడానికి పూనుకోవలసిందిగా చెపుతాను. వారి రిపోర్టు వచ్చిన తరువాత తగు చర్యలు తీసుకోడానికి ప్రభుత్వము సిద్ధంగా ఉన్నదని తెలుపుతున్నాను. ఈ విచారకమైన విషయంగురించి ఇంతకన్న నేను ఎక్కువగా ఉపన్యాసం చేయదలచుకోలేదు. మనమందరము సహకరించి ఇలాంటి ప్రమాదము ఎన్నడు జరుగకుండా చేసుకుందామని రిపోర్టు వచ్చిన తరువాత తగిన చర్యలు తీసుకుంటామని ప్రభుత్వం తరపున చెపుతూ సెలవు తీసుకుంటున్నా.

## Constitution of Public Accounts Committee.

*Mr. Speaker :* I have to announce to the House that the following candidates have been nominated for election to the Public Accounts Committee for the financial year 1957-58.

1. Shri P. Sundarayya.
2. " K.L. Narasimha Rao.
3. ' B. Ratnasabhapathi.
4. ,, P. Narasinga Rao.
5. , S. Ranganatha Mudaliar.
6. ,, T. N. Venkatasubba Reddi.
7. ,, Gadiraju Jagannadha Raju.
8. ,, J. Chandramouli.
9. ,, K. Vijayabhaskara Reddi.
10. ,, P. Venkatasubbayya.
11. ,, A. V. Bhanoji Rao.
12. ,, N. Ramachandra Reddi.
13. ,, Shrimati Masooma Begum.
14. ,, Shri B. V. Gurumurthi.

As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, namely, 14, I hereby

declare them to have been duly elected to the Committee on Public Accounts.

The Finance Minister is a member ex-officio. Under Rule 166 of the Andhra Legislative Assembly Rules, I hereby nominate Shri T. N. Venkatasubba Reddi to be the Chairman of the above Committee.

## Constitution of Estimates Committee.

*Mr. Speaker :* I have to announce to the House that the following candidates have been nominated for election to the Estimates Committee for the financial year 1957-58.

1. Shri P. Sundarayya.
2. ,, Ravi Narayana Reddy.
3. ,, Pillalamarri Venkateswarlu.
4. , B. Ratnasabhapathi.
5. ,, R. B. Ramakrishna Raju.
6. ,, P. Ranga Reddy.
7. ,, K. V. Ramanayya Naidu.
8. ,, T. Veeraraghavulu.
9. ,, L. Lakshamana Das.
10. ,, T. Lakshminarayana Reddi.
11. ,, Meduri Nageswara Rao.
12. ,, Gopalarao Ekbote.
13. ,, K. Seethaiah Gupta.
14. ,, K. Janaradana Reddi (Nagarkurnool).

As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, namely, fourteen, I hereby declare them to have been duly elected to the Estimates Committee.

The Finance Minister is a member ex-officio.

Under Rule 185 (3) of the Andhra Legislative Assembly Rules, I hereby nominate Shri Gopalarao Ekbote to be the Chairman of the above Committee.

## Comstitntion of Committee on Privilages.

*Mr. Speaker:* I have to announce to the House that the following candidates have been nominated for election to the Committee on Privileges for the financial year 1957-58,

1. Shri H. Ramalinga Reddi.
2. ,, K. V. Vema Reddy.
3. ,, V. Kurmayya.
4. ,, G. Parandhamaiah.
5. ,, R. Lakshminarasimham Dora.
6. ,, Shabuddin Ahmed Khan.
7. ,, Achuta Reddi.
8. ,, Amritalal Sukla.
9. ,, Gopidi Ganga Reddi.
10. B. Rama Reddi.

As the number of candidates validly nominated is equal to the number of vacancies to be filled, namely, ten, I hereby declare them to have been duly elected to the Committee on Privileges.

Shri Konda Lakshman Bapuji, Deputy Speaker, member ex-officio.

Under Rule 172 (4) of the Andhra Legislative Assembly Rules, I hereby nominate Shri Konda Lakshman Bapuji to be the Chairman of the above Committee.

మిస్టర్ స్పీకర్ :—ఇంతటితో ఈ నాటి సమావేశము వాయిదా వేస్తున్నాను. రేపు ఉదయం 8–30 గంటలకు సభ తిరిగి సమావేశము వుంటుంది.

*The House then adjourned till Half Past Eight of the clock on Thursday the 18th April* 1957.